గురుఁడైన కవిరాజుఁగూర్చిన సభ కితఁ డగ్రాసనాధిపత్యము వహించి
గురువిపక్షుల వాదసరణిని ఖండించి గురునకు మోదవిస్తరత గూర్చి

తే. గీ. గురువరుని యాశిషముగొని మఱియు శిష్యు
లైన రామకృష్ణులు చేసినట్టి పూర్వ
సుకవిదూషణమును గని సకలజనులు
తన్నుఁ బ్రశ్నింప నంత నీతండు గడఁగి. 41

క. మాకు విరుద్ధులు శిష్యులు, చేకొని యొనరించినట్టి చెట్టకు నిష్కృతిఁ గా
వాకొనుభారము మాపై, నేకతమున నైననేమి, యుడితిరి మీరల్. 42

తే. గీ. కాన వినుఁడని విజ్ఞలోకమ్ముఁ గుఱిచి
యొగి "క్షమాపణ" యను వ్యాస మొకఁడు వ్రాసి
కొంత శాంతి లోకమ్మునఁ గూర్చెఁగాని
శిష్యు లటఁ జేరమిని బనిసేయదయ్యె.

క. అటు రగిలి రగిలి తుదక, చ్చట నచ్చట సభలు సలిపి సత్కవిభక్తుల్
ఘటిలిపడ సారెకుఁ ది, ట్టుటకుఁ మొదలిడిరి కడుఁగడుఁ రుషయెసఁగన్.

తే. గీ. రహిని రాజమహేంద్రవరమున జరుగు
సభకు నీతఁ డధ్యక్షుఁడై చనియె, నందు
నెందఱో పూర్వకవుల నదలించుటకును
నేవపడి రీతఁడుం గూడ నేవపడియె. 45

క. ఆయావిధమున శుభసం, ధాయకమై తలచు గురునిదశ గురునంత
శ్రీ యొసఁగెఁ బిమ్మటఁ శని, నాయకుఁడై యంతరమ్మునకు నింపెసఁగన్

కాళయుక్తి సం॥ భాద్రపద బ ౨ సో॥ రౌద్రి సం॥ ఫాల్గుణ బ ౧౪ వ॥

—: గురుమహాదశలో శన్యంతరము :—

తే. గీ. ఇతఁడు వచ్చినవెంటనే యేగఁజేసెఁ
దోట్లవల్లూరినృపుని సుతునకు జరుగు
బారసాలకు, నచట ద్విపమ్ము నెక్కు
టాదియగు గౌరవమ్ముల ననుభవించె. 47

సీ. ఆత్రోవ నూజివీ డరిగి శ్రీరామచంద్రాప్పరాయనిసుతు ననఘుచరితు
నారయప్పారావు ధీరు సింహాద్ర్యప్పరావు గోపాలాప్పరావుఁ గాంచి
ప్రతివత్సరముఁబోలెఁ గుతుకమ్ముమైఁగొన్ని నాళ్ళు విద్యాగోష్ఠి నడిపి పిదప
వార్షికమ్మును గొనివచ్చుచో నేలూర జ్వరము ప్రారంభించెఁ జయ్యన గృహ

తే. గీ. మరుగునంతట నది యతిభరము నెసఁగె
మఱియు వెనువెంట జనకుఁడు జ్వరితుఁడయ్యెఁ
గొమరుఁడును గూడ జ్వరమునఁ గొంత డస్సెఁ
బలుపలుకు లేల ? గృహమెల్ల జ్వరమయంబ. 49

క. అపు "డిన్ ఫ్లూయింజా" జ్వర, విపరీతపుఁ గాలమగుట వీడెల్ల జ్వరా
తిపరీతము వీడననే, ల, పడిరి దేశంబ జ్వరవిలయమునఁ దెలుపన్. 50

క. ఎనుబదిమూఁడేడుల పైఁ, జను వృద్ధుఁడు దక్కఁ దక్కు సకలకుటుంబం
బును జ్వరమును నిర్జించి సు, ఖనియతి నలరారెఁ దండ్రి గనె స్వర్గంబున్.

తే. గీ. ఆసమయమందె శ్రీనారయప్పరావు
గారిరువదెన్మిదేఁడులు గడచు ప్రాయ
మలరు ధీశాలి విద్వాంసుఁ డనఘకీర్తి
స్వఃపురికి నేగి యితనికి వంతగూర్చె. 52

తే. గీ. ప్రాణమిత్రుండు శ్రీ పోలవరపు ఱేఁడు
గూడ స్వర్గతుఁడై వంతఁగూర్చెఁ బిదప
జనకు మృతికారణమున స్వసదనము వీడి
పొరుగుటింట నుంటయుఁ గూడఁ బొసఁగె నపుడు. 53

క. పొరుగింట నున్నయప్పుడె, జరిగెన్ మఱికొన్ని యిట్టి సందర్భమ్ముల్
మరల గృహమ్మరుదెంచిన. మఱునాఁడుదయించె నొకకొమరుఁడుజ్జ్వలుఁడై.

తే. గీ. మఱియు గుంటూరిసీమలోఁ గరము పేరు
గలుగు చేబ్రోలు పురమున నెలమి నక్లె
పేరుకలపూడి నవధానకారణమునఁ
గలిగె ధనయశోలాభముల్ కడిమి మెఱయ. 55

తే. గీ. అపుడె కృష్ణానదీతీరమందు వెలయు
నగ్రహారం బనంతవరాఖ్య మరిగి

యచటివారలచే గౌరవాతిశయము
లొరసి వెలసిరి వెంకన తిరుపతియును. 56

సీ. శిష్యసాలగ్రామ చింతామణి కుమారు పెండ్లికి నేగి యప్పెండ్లిలోన
మండపేటపురాన నిండారు సభ నవధానంబు సల్పుట, ధన్యతముఁడు
చెలికాని లచ్చిరాట్ప్రభువుఁ డెలమిమైఁ జిత్రాడలోఁ జేయు శ్రీకరంపు
సభ నుపన్యాసంబు సల్పుట, వేట్లపాలెము తాళ్ళపూడి గ్రామమును నేగి

తే. గీ. పుస్తకంపుభాండాగారముల సభలకు
నాధిపత్యంబు సల్పుట యాదిగాఁగఁ
దఱచు విద్యావినోదముల్ తొరసించి
యచటి కిచటికిఁ దిరుగుట యనుభవించె. 57

ఆ. వె. పైని చంటిపిల్లవానికి బారసా
లను నొనర్ప నెమ్మదిని దలంచు
నంత దైవనియతి నాకుఱ్ఱఁడు మశూచి
చే గతించె మనసు చెడియె దాన. 58

తే. గీ. పిదప దేహమ్ము రుజకు నాస్పదమునయ్యె;
నట్టితఱి మున్నె వత్తు నన్నట్టికతన
నల సికిందరాబాదున కరుగవలసె
నాత్మశిష్యుని కొమిరె కళ్యాణమునకు. 59

క. సతితో సుతుతో శిష్యుని, తతితో నట కేగ నచటఁ దత్కల్యాణ
స్థితికతనఁ గొంత హృదయపు, వెత దొలఁగె శరీరరుజయు వెనుకంజయిడెన్.

తే. గీ. కొన్నినాళ్లుండి దేశానకుఁ జనుదెంచు
త్రోవ శ్రీనూజివీడేగి దొరకుటుంబ
మును బరామర్శించి యా పొలియందుఁ
గొన్నినాళ్లుండి గ్రామానకుఁ జనుదెంచె. 60

క. ఆరోగ్య మప్పటప్పట, ధారాళము గాక తప్పుదారులు ద్రొక్కం
గా రోజు లెట్లో గడుపం, గా రహి నేర్పడియె సౌఖ్యగరిమం బవలన్.

ఆ. వె. అంతఁ గొమరుఁ డొక్కఁ డావిర్భవంబందె
విజయవాడ దుర్గ వేఁడి మున్ను

తల్లి ప్రెమొక్క నక్కతమున దుర్గాభిఖ్య
వాని కుంచఁబడె నహీనగరిమ. 63

క. ఇలువేలుపు కామేశ్వరి, యల యంబిక పేరు పెద్ద యతని, డితనిదో
యల యంబనామములయుం, దలిదే యిర్వురను దేవినామము వారే. 64

తే. గీ. అవల మంత్రిప్రగడ భుజంగావనీశు
కామిరె పెండ్లికి నేగు పెక్కుడు ముదమ్ము
గదియ సంగీతసాహిత్యకవనగోష్ఠి
కతనఁ గాలమ్ము హేలగాఁ గడపు టొదవె. 65

ఆ. వె. కాని పెద్దపిల్లవాని కష్టప్పుడు
తనసుఖమ్ము చెడుకతమున మదికిఁ
దగినయంత స్వస్థతయు లేకపోవుట
యును ఘటించె దైవయుక్తిఁజేసి. 66

ఆ. వె. అంతఁ బ్రాణమిత్రుఁడైన శ్రీ తిరుపతి
శాస్త్రి స్వర్గ మేగె; సగము దాన
బుద్ధిబలము దేహమున బలంబును గూడఁ
దగ్గె దైవనియతి దాఁట వశమె! 67

క. ధనభూసంపాదనమును, దనయావాప్తియును హితసదనశుభసంద
ర్శనమును నృపసమ్మానన, మును లేని ఘటించె మొత్తమున నెనకమునన్.

రౌద్రి సం॥ ఫాల్గున బ ౧౨ రె మొ॥ రుధిరోద్గారి సం॥ ఆషాఢ శు ౫ వ॥

—: గురుమహాదశలో బుధాంతరము :—

తే. గీ. అంత బుధునంతరము వచ్చె నాత్మదేహ
మునకు నారోగ్యము నయత్నమున నృపాలు
రాణివాసంబు కతమున దద్రవ్యలబ్ధి
మొట్టమొదటనె ఘటియించె నెట్టులనిన. 69

సీ. చిత్రాడవాసి ప్రసిద్ధుండు కవితకై సర్వస్వదానంబు సలిపి స్వల్ప
కాలమ్ములోన నఖండభూమండలాఖండలు లార్జింపఁగానని యశ
మార్జించినట్టివాఁ డంతో యింతో కవిత్వ మల్లెడివాఁడు గానాభిరతుఁడు
పోలవరంపు భూపాలుఁడిమ్మటఁ దిరుపతిశాస్త్రి నేలిన భవ్యగుణుఁడు

తే. గీ. రమణఁ జెలికాని శ్రీలచ్చరావు తలఁచు
వార్తలంపఁబోడంగెఁ దప్ప కకసారి
"దర్శన మొసంగుఁ" డనుచు నెంతయును నాద
రంబు భయభక్తులును సంభ్రమంబు మిగుల. 70

ఆ. వె. ఇల్లు గదలుటన్న నెంతో యత్నము మీఁదఁ
గాని గలుగనట్టి కాల మప్ప
టికి నొకింత మున్నె సుకవి వేంకటశాస్త్రి
కబ్బుకతన నరుగు టబ్బదయ్యె. 71

తే. గీ. అంతలో వచ్చె సన్నవరాధిదైవ
మైన శ్రీ సత్యదేవు కళ్యాణమహము
అచట సంస్థానపండితుఁ డౌటఁ జేసి
యరుగుచును ద్రోవఁ జిత్రాడ కరిగె నితఁడు. 72

క. అరుగుడు లచ్చారాయుం, డతిముదిఁ జెప్పంగరానియంత ముదమ్మున్
బొరసి కడు గౌరవించియు, మరల నరుగువేళఁ బలికె మంతనమందున్. 73

క. మా తోఁబుట్టువు రామాం, బా తరుణీతిలక మిట్లు మన్నన యెసఁగన్
మీతోడఁ జెప్పుమనియె య, థా తాత్పర్యముగ వినుఁడు తద్వచనములన్.

చ. ఇరువదియైదు రూపికల నేనెల కానెల మీకుఁ బంపుచున్
గరము బహూకరించెద మొకానొక యప్పుడు గాని మీకు మా
పురి కరుదేర నన్నియమమున్ గొనఁగాఁ బనిలేద, మీర లు
త్తరపు వయస్సునందునికిఁ దద్దయు నే నిటు చేయ నెంచితిన్. 75

క. ఇది మీకు 'నౌకరీ' గా, దిదియేఁ బనిపడినయప్పు డేమే మిమ్ముఁ గో
రుదు మెవరి నేని బంపి, స, హృదయులు మిము గౌరవింపరే భూమీశుల్?

తే. గీ. అంత రాఁ బనిపడినప్పు డదనముగను
రాకపోకల వ్యయమిడి రమణ ననిపు
నట్టి యేర్పాటు చేసితి ననుచుఁ జెప్పి
యిమ్మనియె దీని నని జీత మిచ్చె నెలకు. 77

క. కలి నిట్టి వదాన్యత్వము! కలి మాత్రమ కాద పైని గలికి గదా! యీ
బలవంతపు గౌరవ మి, మ్ముల సలిపెడి ప్రభ్వి కడు నపూర్వం బడియున్.

క. అని యిది సర్వమ్మును నీ, యనఘుని ప్రోద్బలము కాని యన్యము గా దీ
యన కవితాదరుఁడౌటను, మనతోఁ బనిపడుచునుండు నాటికి నెప్పుడున్.

తే. గీ. దాని కిట్టి యుపాయమ్ము దగ నొనర్చి
యుండునని దానిఁ గైకొని యోలి నన్ను
వరమునకు నేగి కళ్యాణవైభవంబు
గాంచి స్వగ్రామమునకు వెంకనయు నరిగె. 80

ఉ. బందరు ప్రాంతమందుఁ జలపల్లిజమీన్విభుఁ డంకినీఁడు బి. యే.
యందుఁ గృతార్థుఁ డీయనకు సయ్యె ననర్ఘ్యమహాభిషేక మా
సందడి కాన్యపాలకుఁడు సత్కవి వెంకనఁ బిల్వనంపె నా
నందముమై బహూకృతి ఘనంబుగఁ దా నొసఁగెన్ యథోచితిన్. 81

ఆ. వె. కాచమేని జేయఁగాఁబోని నీచశా
త్రవుల కారణమున రచ్చ కరిగి
యందు విజయమందు టట్లుండఁ గడు యోగ్యు
లైన ఘనుల మైత్రి నందె నెలమి. 82

క. "వా రెవ్వ" రనిన విస్సా, ప్రారావును సోమినాన్వవాయుఁడు కడుగం
భీరుఁడు కామేశ్వరరా, వారయ నల పద్మనాభ మల్లచయనులున్. 83

క. ఆనందం బలరఁగ ఛా, త్రానీకము బలసి కొలువ నాశ్రమవనమునం
దే నెలల కొలఁది విడియుట, వానప్రస్థాశ్రమంపు వైభవ మబ్బెన్. 84

సీ. మురుమండ వెంకటగిరి యువరాజు శా నయ్యనఘాత్ముని నారయుటయు
స్వగ్రామమునఁ బాఠశాల నొకఁడు నిల్పి విద్యాభివృద్ధి గావించుటయును
మిత్రుల గృహముల మేల్మిమై జరుగు శుభాదికమ్ములు చూడ నరుగుటయును
తన పెద్దకొమరున కనుకూల మగురీతి వేడ్కమై వడుగు గావించుటయును

తే. గీ. నలిఁ బ్రభావతీప్రద్యుమ్న నాటకంబు,
నెలమి నారోగ్యమిడెడి కామేశ్వరినుతి,
హేయులను మందలించు మల్లేశువినుతి
యును రచించుట బుధునంద యనుఘటించె. 85

రుధిరోద్గారి సం॥ ఆషాఢ శు ౫ మొ॥ రక్తాక్షి సం॥ జ్యేష్ఠ శు ౧౧ వ॥

—: గురుమహాదశలో కేత్వంతరము :—

తే. గీ. అంతఁ గేత్వంతరమ్మున, జయంతి రామ
యార్యుని గృహమ్మునం దుపనయమహోత్స
వమున కరుగుట యట బహుపండితప్ర
కాండమండలిచే మెప్పుగనుట మఱియు. 86

తే. గీ. ఆగృహస్థు సమ్మానంబు నందుటయును,
ద్రోవ ముమ్మిడివరమునందున సదస్సు
నం దుపన్యాస మిచ్చుట, యచట వారి
గౌరవము గాంచు టాదిగాఁ గలిగె దీన. 78

క. వేంకటసుబ్రహ్మణ్యా, ఖ్యాంకితుఁడగు బంధుముఖ్యు యోగముఁ గూడన్
వెంకనకుఁ దటస్థించె న, లంకృతవిప్రుఁడగు నింజరగ్రామమునన్. 88

తే. గీ. మఱియు సకుటుంబముగ నన్నవరము దేవు
దర్శనమ్మున కరిగి వ్రతమ్ము సలిపి
స్వపురిత్రోవ లక్ష్మీనరసపురి రాణి
గా రిడిన నూఱులార్లు వెంకన గ్రహించె. 89

రక్తాక్షి సం॥ జ్యేష్ఠ శు ౧౧ మొ॥ క్షయ సం మాఘ శు ౧౧ వ॥

—: గురుమహాదశలో శుక్రాంతరము :—

క. భృగునంతర్దశయందున, భృగువిడశన్ గొమిరె పుట్టి పెంపొందె ముద
మ్ము గలిగె మిత్రగృహమ్ముల, నగు శుభకార్యములకరుగు సత్కారణమై. 90

ఆ. వె. ఆత్మకూరి శేని యనుఁగు నిల్లాలు పి
ల్పించెఁ బీసపాటి వేంకటరమ
ణాఖ్యు ద్వారమునను హైదరాబాదుకు
గౌరవం బొనర్పఁగాఁ దలంచి. 91

తే. గీ. ఆపురిని నింకనుం గొన్ని యయ్యె సభలు
నూఱులార్లు సేలువులు విస్తారముగ ల
భించె; నాయె నెన్నెన్నియో పెద్ద విందు;
లాత్మకూర్ నృపుసుతుఁడు సత్యాదరమున. 92

క. మును తన జనకుం డిడు భూ, మిని గైకొనఁ దన నగరికి మేకొని రమ్మం
చును గోరెఁ గాని చనకయె, తన గ్రామమ్మున కరిగె నితండు కడంకన్.

ఆ. వె. దండనాధికారి దైవతభక్తియు
క్తుండు లింగమన్నయుండు కవిత
యన్నఁ బ్రాణమిడు జగన్నాథరాట్పుత్రు
పెండ్లి కరిగి గౌరవింపఁబడియె. 94

క. శ్రీరాజితంబు విస్సా, ప్రారాయని మూఁతు పెండ్లివైభవము మనం
బారఁ గాంచుటయును స, త్కారమ్ముల నందుటయును గసిగం బిడపన్.

తే. గీ. కాటరావులపల్లె భూకాంతుఁ గలిసి
కొనుట, లక్ష్మీనరసపురి నసుకొనసివి
మూఁడు నూటార్లు చెల్లాఁబ మొగిని రామ
యాంబయూ నొసంగఁ జేకొను టబ్బె నిందు. 96

తే. గీ. అంత నించుక రుజచేసి యది శమించె;
నప్రయత్నమ్ముగాఁగ ముక్త్యాల వాసి
రెడ్డి చంద్రమౌళీశ్వరనృపతివరుఁడు
పిలువఁగానంపి కడు గౌరవించె నెలమి. 97

క. అది యెక్కుడి దాతృత్వమొ!, యెదియు నిమిత్తమ్ము లేకయే నూటాఱుల్
ముదమున మూఁడును బట్టెనఁ, బొదలెడి వస్త్రములు మౌళిభూపతియొసఁగన్.

తే. గీ. వడ్లమూర్గ్రామమునకు శివప్రతిష్ఠ
కరుగుటయు నట బహుమాన మందికొనుట,
వంగవోలేగి యట గౌరవంబు మిగుల
నూఱులార్లందికొనుటయును దగె దీన. 99

క. హంసలదీవికి నరిగి ప్ర, శంసాపాత్రమగు క్షేత్రసంగతిఁ బాప
ధ్వంసకమగు కృష్ణానది, మాంసలమగు భక్తిఁ దానమాడెఁ గడంకన్. 100

తే. గీ. ఆంధ్రపత్రికావ్యాపకుఁ డతివదాన్యుఁ
డెలమి శ్రీ కాశినాథ నాగేశరావు
పిలువఁ జెన్నపురికి నేగి పెద్దసభలు
చేసి గౌరవముం గొనె వాసి మిగుల. 101

తే. గీ. మఱియు నల్లాడి కృష్ణసామయ్య పిలువ
నంపి యాత్మీయసౌధమునందుఁ గొంత
గోష్ఠి కెడమిచ్చి నూత్నార్థ గొప్ప గౌర
వముగ నాగేశ్వరుఁడువోలె వ్రాసి నొసఁగె. 102

తే. గీ. ఆసభకు వేంకటగిరీశుఁ డరుగుదెంచి
తమ విడిది కొక్కసారి రాఁగ నొగిఁ గోరెఁ
గాని యదియేమొ యచటి కేగకయున్న
తలఁపనితలంపుగా రుజ దారసించె. 103

కం. వెనువెంటనె స్వగ్రామ, మ్మునకుం జనుదెంచె; వ్యాధి ముమ్మరమై పీ
డనుగొల్పి యెట్టకేలకుఁ, దన దుర్దర్పమ్ము విడిచి తనుసుఖ మిడియెన్. 104

ఆ. వె. అంతఁ గొమిరె యొకతె యావిర్భవంబందె
సంతసముగ బారసాల జరిగెఁ
బెద్దకొమరు పెండ్లిచేరమ్ములకుఁ గన్య
కల జనకులు వచ్చికలిమి బలిసె. 105

తే. గీ. అంత బందరుపురికి సభార్య మరుగ
పలసె నయ్యెడ సమ్మానవైభవంబు
జరిగి యింటికి వచ్చియు శరదృతు నవ
రాత్రిపూజల నల్ల శర్వాణిఁ దనిపె.  106

కం. సుకముండునంత దేహము, నకు మరలన్ వ్యాధిపీడనము ద్విగుణంబై
తికమకలు పెట్టఁదొడఁగి య, ప్రకృతిన్ గావించుటకును బ్రారంభించెన్.

తే. గీ. అట్టి సమయమ్మునందు "దేశాంతరముల
నెంతయో గౌరవముసేయు నిక్కవీంద్రు
మనము గూడఁ జేయఁగరాద" యనుచుఁ బౌరు
లెలమి నూరేగఁగాఁ జేసి రితనిఁ జేర్మి. 108

ఆ. వె. శుక్రునంతరమ్ము సురుఁగునంతటిదాఁక
పీడగొల్పి వ్యాధి వెనుకఁబట్టె;
నంత రవియు వచ్చె నంతర్దశానాయ
కత్వమునకు, నవలి కత వచింతు. 109

క్షయ సం॥ మాఘ శు ౧౧ సో॥ ప్రభవ సం॥ కార్తిక బ ౧౪ వ॥

—: గురుమహాదశలో రవ్యంతర్దశ :—

సీ. అన్నవరంపుఁ గళ్యాణానకరుగుట, మురుపారఁగ దేవుని పరిణయోత్సవ
కరుగుట, యిటనటజరుగు నుత్సవములఁ గనులారఁ గాంచి యొక్కొక్కెడఁ బ్రకాశ
రాయఁ డింకొకట సూర్యారాయఁడును జేయుసత్కారముల నెనకొంబగనుట,
వ్యాఘ్రేశ్వరపు వివాహమ్మున కరిగి యయ్యెడ నెందకొండటో యుద్ధపాండి

తే. గీ. తీకులఁగువారి దర్శించి తేఁకునమొయి
వారి మెప్పును గనియు గపగయ మంగి
పూడికులుఁ డిడు గౌరవమును గొనుటయు
నమలపురమున మర్యాదనందుటయును. 110

ఆ. వె. అవలఁబాలకొల్లుకరిగి శ్రీకృష్ణభా
రతము కృతినొసంగు రమ్యసభను
మఱియు నొక్కసభను మంచి యుపన్యాస
ముల నొసంగి యంతఁ బోక మఱియు. 111

క. నరసాపుర పౌరుల యా, దరమున సట సభయు జరిపి తజ్ఞు లటనిటన్
విరివిగ నిడు నూతాలుల, నఱిముఱి సేలువులఁ గొనియు నలరుట యొదవెన్.

తే. గీ. మఱియు "యునివర్సిటీ బోర్డు" మండలమున
మెంబరగుట విజయవాడ మేల్మి నరుగ
నచట నున్న బందరు శిష్యు లప్రిపత్తి
సత్కరించిరి నూతార్లు సాలుజోడు. 113

క. గుడివాడపురమునం దొ, క్కెడ బందరు శిష్యవర్గ మిట్టులె సభ నొ
క్కఁడు గూర్చి నూటులాలులు, నిడి సత్కారంబొనర్చి రెంతయు భక్తిన్.

క. ఇట నొక్క శంక, రవి యే, మిటికిన్ యోగింపవలయు మేలుగ మన వెం
కటశాస్త్రిజాతకమున కొ, కటియు నిమిత్తంబు గానఁగారా దనుచున్. 115

తే. గీ. జాతకజ్ఞు లనేకులు శంకగొందు
రక్కతమ్మున నే మారకాఖ్యశాస్త్రి
గూడ యోగింపఁడని వ్రాసెఁ గొంకు దక్క
యునయోగించుటకు హేతు వరయుఁడయ్య. 116

తే. గీ. కుసుమరాజయోగగ్రహకూటమందు
రవి యొకరుఁ డౌటఁజేసి, తా రాజయోగ
కర్తగా నుండె వేఱొక్క కారణంబు
గానఁగారాదు కనుఁడు విజ్ఞాను లిట్లు. 117

క. మారకశాస్త్రిలు కడు వి, స్తారపు రుజ గొల్పు ననియుఁ దా వ్రాసెను గా
నీ రుజ సైతము కొంచెం, బే గగిలి శమించె నింత యెఱుఁగుదు తజ్ఞుల్. 118

తే. గీ. యోగ మెక్కుడుగా, నసయోగము గడుఁ
దక్కువగఁ జేసి సూర్యసంవత్సరము తరలె;
నవ్వుల నరుదెంచెఁ జంద్రుని యనంతరంబు
శుభపరంపర లెల్లెడ సొబగు గొలుప. 119

ప్రభవ సం॥ కార్తిక బ ౧౨ నుండి॥ విభవ సం॥ ఫాల్గున బ ౧౨ వ॥

—: గురుమహాదశలో చంద్రాంతరము :—

తే. గీ. శ్రీకరంబుగఁ బట్టాభిషేక సుముము
వార్తనంపించె బొబ్బిలి పార్థివుండు
కొమరునుపనయనంపు మూర్తము నమీప
మగుట రానని వ్రాసె వెంకన నృపతికి. 120

చ. పదపడి పార్థివుండు "చనవచ్చు ముహూర్తము కన్న మున్న మీ
రెద నిట సందియంపడకుఁ డొక్కటి మి మ్మతివేగ పంపితీ
రెద" మని వ్రాయఁజేయుటయు నేని ముదంబున కన్యదాత్వ మొ
ప్పదనుచు వేగ బొబ్బిలికి వారక శిష్యగణంబు గొల్వఁగన్. 121

చ. చని యట నుత్సవంబుల పసందు సమస్తము కన్నులారఁ గ
న్గొని తన కైతచేత నలకుంభినిభర్తకు నింపు నింపి యా
జనపతివల్ల మేల్మిపని సాలువు లర్థసహస్రరూప్యముల్
కనకమయంబు గంకణయుగమ్మును సత్కృతిగాంచి వచ్చెరన్. 122

చ. స్వపురికి నేగుదెంచి తనుజన్ముని రెండవవానిఁ బేర్మిమై
నుపనయసంస్కృతుల్ జలిపి యుచ్చతరంబుగ బంధువర్గ మీ
నెపమున సత్కరించి,పయి నెట్టిన నాల్గవ మాసమంద పెం
డ్లి పొనరిచెం దటాల్న నవలీలగ జ్యేష్ఠునకున్ ముదంబునన్. 123

తే. గీ. ఇట్టు లుత్సవములపైని నెప్పుడు నుత్స
వములతో నగమేగఁ జంపర్రియుని యంత
రంబు, మఱి యట్టిరటేఁ 'గలరా' స్వపత్ని
కనుసుటించియు మరలె నయ్యంబ మనుసు. 124

తే. గీ. నూజివీటికి వార్షికం బోజఁ గొనఁగ
నేగి సింహాద్రి యప్పారియనృపుని చేత
నిమ్ము మీఱ యథాపూర్వకమ్ముగాఁగ
గౌరవము నొంది వెంకన కడియు మరిగె. 125

క. ఇఁక నొక్కటి; పెద్దకుమా, రకుని వివాహమ్మునకు కల రామాంబిక యూ
పిక లైదునూఱు లంపి త, నకుఁ గల తాత్పర్యమును గనంబడఁజేసెన్. 126

తే. గీ. మఱియుఁ ముక్త్యాల శ్రీ చంద్రమౌళినృపుఁడు
నూటపదియాఱు లంపెను; నూఱులార్లు
గాక వస్త్రాదులంపెఁ బ్రకాశవిభుఁడు
అన్నవరసత్యదేవుధర్మాధికారి. 127

క. ఒక కొమరునకున్ వడుగుం, కొక కొమరునకున్ వివాహ మొగిఁజేసియుఁ ద
క్కక యుత్తమర్ణుఁడైయీ, సుకవియొసంగెన్ ఋణమ్మునంతయుఁ గొనమిన్.

తే. గీ. ఉత్తమర్ణపదంబున నోలి నిల్పి
సకలవిధముల శుభములు సంతరించి
తనదు చల్లదనంపుఁ జందమ్ము నెల్ల
వెంకనకు శీతరుచి చూపి వెడలె నవుల. 128

విభవ సం॥ ఫాల్గున బ ౧౮ మొ॥ శుక్ల సం॥ ఫాల్గున శు ౫ వ॥

—: గురుమహాదశలో కుజాంతరము :—

క. మంగళుఁ డగుదెంచెఁ గడున్, మంగళసంధాయకుఁడయి మఱువఁదగద స
త్సంగతుఁ డితఁ డిచ్చిన స, న్మంగళముల నితని పేరు మంగళుఁడె కదా.

క. కుజమంగళనామమ్ముల, నజుఁ డీతని కిడియె; రెంటియుం దాద్యాఖ్యన్
గజిబిజి, రెండవదానన్, బ్రజకున్ ముదమబ్బుటయును బ్రకృతిగతంబుల్.

ఆ. వె. ఏను మొదల నితనిదైన యాద్యాభిఖ్యఁ
బట్టి తప్ప దితఁడు భంగమేది

యో ఘటించితీఱు యుక్తి మిప్పట్ల జా
గ్రత్త యనుచు నెంచి కడు రయమున. 132

తే. గీ. గృహిణిచే నొక్క "విల్లు" వ్రాయించి యాపె
పేర నున్న సొత్తెల్లఁ గుమారకులకుఁ
జెల్లు నట్లందు నేర్పాటు చేసి మఱియుఁ
జేయఁగల సదుపాయముల్ చేసికొంటి. 133

ఆ. వె. కాని కుజుఁడు మొదట గడబిడ యొక్కింత
కలుగఁజేయునట్లు గానఁబడియు
సకలగతులఁ దుదకు సన్మంగళావాప్తి
నలిపి యెంతయేని గొలిపె ముదము. 134

క. మోకాలియొద్దఁ గురుపై, యేకొంచెము పీడనెట్టె; నిది తక్కిన నిం
కేకష్టము నితఁ డిడలే, దేకడ శుభలాభజయము లెసఁగంజేసెన్. 135

క. ఒక కొమరుండుదయించె, మ,ఱొక కొమరుని పెండ్లియున్ మహోన్నతగతిఁబు
త్రికల కిరువురకుఁ బెండిలి, యిఁక నెన్నియొ శోభనమ్ము లితఁ డెసఁగించెన్.

క. విరివిగ లక్ష్మీనరసా, పురపు జమీందారురాలు పూర్వమునలె ను
త్తరమగుగతి ద్రవ్యంబిడి, మరియాదనొసర్చె రామమ పొరింబొరిగన్. 137

తే. గీ. తేలప్రోలి జమీందారు, ధీరసుకవి
యల్ల యయ్యారి ఱేఁడు, చెల్లాంబ గన్న
వరపుఁ బేలిక, ముక్త్యాల వల్లభుండు
వలసినంత ధనంబు సొంపలర నిడిరి. 138

చ. వెనుక నుదాహరింపఁబడె విశ్రుతుఁడా చలపల్లి ఱేఁడు; త
జ్జనపతి కూర్మిపుత్త్రికకు సత్కవి గేయున కర్యెఁ బెండ్లి, మిం
చినగతి నీన్నృపాలునభిషేకము గూడ నెసంగెఁ బెండ్లి వెం
టనె; పిలుపబ్బి వెంకన హుటాహుటి నేగను జల్లపల్లికిన్. 139

చ. కనమొకొ! మున్ను భూపతుల కాన్పుల పెండిలు లెన్నియో, యొన
ర్చిన యభిషేకముల్ గనమొ! శ్రీయుతమూ చలపల్లెలో నొన
ర్చిన యభిషేకమేమి, యటఁ జెన్నలరారిన పెండ్లియేమి క
న్గొనవలెఁ గాని యేకవులకున్ వివరింప నశక్య మాగతుల్. 140

ఉ. ఎందఱు వచ్చిరో సుకవు! లెందఱు గాయకు లేగుదెంచిరో!
విందుగ నాటకమ్ము లవి వేఁబడి వెంబడి నెన్ని యైనవో!
యందును గోటచుట్టు నల యామిని భాగవతంబు లెన్ని వెం
పొందినవో! వచింప నెవఁ డోపెడిఁ! జూచియుతీరఁ గావలెన్. 141

తే. గీ. పెండ్లి మొద లభిషేకంబు పెంపుదనుక
నొక్క నెల పట్టె దాదాపు నిక్క మిన్ని
నాళ్లు విందులు మఱియు విన్నాణమైన
సభలు జరుగుచునుండె నిశ్శంకగరిమ. 142

క. పదికిన్ దక్కువ, వేయికి, నదనమ్ముగ గాని తక్కు వంచును మెన్
ప్పాదవఁగ బహూకృతుల నిడి, యదనముం గాక పయి నిడి సన్మానపలుపల్. 

తే. గీ. ఎవ్వనికిఁ గాని ముట్టలే దిం దటన్న
యపయశము లేశమును లేద, యహహా! యిట్టు
లేస్రవున కయ్యెఁ బెండిలి! యే ధరాధి
పతికిఁ బట్టాభిషేకంబు పరిఢవిల్లె! 144

తే. గీ. నోరుగలయట్టి కొందఱ కేరికేని
నెక్కుడుగ నిచ్చి పంపుట, యితరులకును
శుద్ధశూన్యంబగుట యెందుఁ జూచుచుంటి;
మిచట సర్వంకషం బీవి యింత నిజము. 145

క. ఇఁక నొకటి యర్థునకు ము, ట్టకపోవుట లేద, యొక్కడ ననర్థుఁడవా
నికిఁ గూడ ముట్టెనేమో, సకలం బిది నిజము, యిందు సాక్షు లనేకుల్.

ఉ. అమ్మహనీయసత్కృతులయం దధికారము వాసిరెడ్డివం
శమ్మునకున్ విభూషణము సద్గుణగణ్యుఁడు చంద్రమౌళి, రా
జ్య మ్మెపుడు చేలుచుండిన రసాపతిమౌళికి మేనమామ హ
స్తమ్మున నుంటఁజేసి యది తద్దయు శోభిలెఁ గీర్తిహేతువై. 147

తే. గీ. "ఐనవారల కాకులు కానివారి
కెల్లఁ గంచమ్ము" లను మాట యించుకేని
ప్రజలగోష్ఠులలో వినఁబడకయుండ
నఖిలమును నిర్వహించె ముక్త్యాలవిభుఁడు. 148

క. వేయున్నూటాఱుల సగ, మీయధిపతి యొసఁగె వేంకటేశున కిటులే
సాయము శుభకార్యములకు, నాయెడ లభియించె యత్నమది లేకుండన్.

తే. గీ. మఱియు దొడ్డముపేట భూవరుఁడు వాఁడె
రేవు విశ్వసుందరరావు, నృపతి శ్రీ భు
జంగరావు, గూటాలరస కధినేత్రి
యైన శ్రీ మహాలక్ష్మాంబ యదియుఁ గాక. 150

క. బాకురుపండాగ్రహా సు, శ్రీకుఁడు వేంకటరమణుఁడు చేసిరి సాయం
బీకార్యములకు, వీరల, నేకాలము మఱవరామి నిందు నొడివితిన్. 151

తే. గీ. రామచంద్రాప్పరావు పూర్వమునఁ జేయు
వార్షికము నిప్పటికి ననవద్యగరిమ
నతని రెండవసుతుఁడు సింహాద్రి యప్ప
రా విడుచుచుండెఁ బరమాదరంబుతోడ. 152

క. ఏగినను నేగకున్నను, రాఁగల యావద్ధనము కరముఁ బోల్కి మహా
భాగుఁడు రానుతుఁ డంపెడి, నీగరిమయు వర్ణనీయ మిది యిటు లుండెన్.

శా. ఈసింహాద్రివిభుండు వెంకనకుఁ దా నిప్పట్లఁ గొంకం డొగిన్
జేసాపన్ మఱి యెంత ద్రవ్యమయినం జేయుంగదా! సాయమున్
జేసాపన్ బనిలేద మానమయినంజేకొన్న వెంకన్నకున్
దా సర్వస్వము ధారవోయుననుటల్ తథ్యంబు ముమ్మాటికిన్. 154

తే. గీ. అట్టితఱి వెంకనకుఁ దోఁచె నాత్మ నింత
వింతదాత మనయెడల వేలొకరుఁడు
లేఁడుగాని ద్రవ్యంబంత లేదితనికిఁ
బ్రకృత మిట్టొట నిటఁ గొనఁ బాడిగాదు. 155

క. ధనమదియొందలొయిచ్చిరి, ఘనముగశుభకార్యముల కిఁకన్ గొనుటదియున్
జన; దీద్రవ్యము నిలువకుఁ, గొను టుచితముగాద యిట్లగుంగా కనుచున్.

ఆ. వె. నృపునితోడఁ బలికె "నెపుడు మీ రొడెడి వా
ర్షికము చాలు నాకు రేపు వచ్చు
వత్సరమును గలిపి యుత్సాహమున నిప్పు
డిందు వేయి యిడిన నే గ్రహింప. 157

తే. గీ. ఎంత యిమ్మన నంతయు నీ వొసఁగుదు
వే నెఱుంగుదు నాయెడ నెట్టి పేర్మి
మీకుఁ గలదో ? యట్లొటనే మిమ్ము నిట్టు
లేను యాచింతు నాకోర్కి యిదియె నిజము." 158

క. అనఁ గవియెడ గురుభావం, బునఁ జేసియు నప్పు డట్లె యొంపిరివోవం
జనుపేర్మి నొసఁగె సింహా, ద్రి నరేశుం; డతనిఁ జెప్ప నితరులకా.

మ. అవిభాజ్యమ్ముగ నూజివీడ్విపులరాజ్యంబున్ సింహాద్రిరా
డవనీభర్తకె యేకచక్రిముగఁ బాల్యంబాట నిక్కంబ, యే
యుపయోగమ్ములు దైవకల్పితములై యావిర్భవంబందకు
న్నవిభుం డీకృతిభర్త పీఠపురపు న్సొంపు రాజ్యానకున్. 160

చ. గతమున కేమి, యిప్పుడు నఖండ వదాన్యత యోగ్యతా పరా
గ్యతల నెఱింగి యీవి వినయంబు నయంబు మొదల్ గుణమ్ము లీ
ద్వితయమునందు మిక్కిలిగఁ దేజరిలున్, సుకులోద్భవుల్ కవి
ప్రతతికి వర్ణనీయు లను భావమునన్ లిఖియింతు నింతగన్. 161

తే. గీ. పష్టలాభాధిపతి యమ్యు సహజనుగను
గ్రూరుఁడయ్యుఁ గుజుం డాత్మగుణము విడిచి
విపులముగ నీతనికి నెట్టు లుపకరించె
ననెడి యంశ మిచట విచార్యంబు నుంత. 162

క. శుభులం గూడిన పాపులు, శుభమును, బాపులును గూడు శుభు లశుభంబున్
బ్రభవింతు రనుట నాకు న, నుభవమునకు వచ్చె నిదియు నూనం బరయన్.

తే. గీ. మఱియుఁ గొన్ని కారణములు మహిసుతు నెడఁ
గలవు గురుదశ నింత యోగము నొనర్చె
పొంటె, నితఁ డాత్మదశఁ గూడఁ బూర్ణతరము
గాఁగ యోగించె భిద నుంత గలదు దాన. 164

తే. గీ. ఎంత యోగంబొ రోగంబు నంతఁ జేసె
వెనుక నిపు డట్లుకాక యార్జనము, దేహ
మున ననామయభాగ్యమ్ము నొనరఁగూర్చెఁ
గాన నింతగఁ జర్చింపఁగడఁగవలసె. 164

క. యావత్కాలము శుభదం, బై వెలయఁగ గురుఁడు తనదు నధికారంపుం
బ్రావీణ్యము నెఱపి చనియె, నావెనుకన్ వచ్చె రాహువంతర్దశయున్.

శుక్ల సం॥ ఫాల్గున శు ౧౧ మొ॥ అంగీరస సం॥ ఆషాఢ బ ౧౪ వ॥

—: గురుమహాదశలో రాహ్వంతర్దశ :—

క. తన కొమిరెల పెండ్లిండ్లకు, ననుబంధములైన శుభము, లనఁగా మఱియున్
మనుగుడుపులు లోనగు శుభ, వననిధి నీఁదంగ శిఖి యవారణఁ జేసెన్. 167

తే. గీ. ఘనుఁడు శ్రీ యినుగంటి ప్రకాశరావు
షష్టిపూర్త్యుత్సవమ్మును సలుపఁదలఁచెఁ
గాని యది సఫలత్వము గాంచదయ్యె
ననుగుణమ్ముగు నారోగ్యమందకునికి. 168

క. మోతీవంశ్యుఁడు కడుఁ బ్ర, ఖ్యాతుండగు గంగరాజు ఘనముగ నూతా
ర్లీతని కిడె నేలూర్పురి; నీతం డిడె నిట్లు మునుపు నెన్నియొ సారుల్. 169

తే. గీ. అంత నవరాత్రములు వచ్చె నమ్మహమున
కేగుదెంచిరి యల్లుండ్రు నెసక మెసఁగ
జరిగె నయ్యుత్సవంబు ప్రశస్తగరిమ
యంతలో దేహమున కార్తి యనువుపడియె. 170

తే. గీ. స్వల్పకాలమ్మునన యది శాంతిఁజెందె;
నవుల బొబ్బిలి యోఁడు మున్నడిగినట్టి
యాత్మపట్టాభిషేకకావ్యమ్ము పూర్తి
చేయ మొదలిడె వెంకన శ్రీదలిర్ప. 171

తే. గీ. ఇట్టితఱిఁ బెద్దకొమరున కెంతయేని
జ్వరము మొదలిడి యది దేవికరుణకతనఁ
దుదకు శాంతించె, నంతట నదనువచ్చె
బొబ్బిలికి నేగి కృతి యిచ్చువహించె నవుల. 172

క. వెంకనకు దేహమునఁ గడుఁ, బెంకెతనపువ్యాధి పొడమి బింకమ్మెసఁగన్
శంకాసంకులుఁ జేయుఁడుఁ, బంకజహితుఁ గవితఁ దనిపె భాస్కరదేవున్.

ఆ. వె. ఆదిశేషుకరుణ నారోగ్య మేర్పడె;
నంత శిష్యవర్గ మాత్మజులును

బలిసి కొలిచిరొగఁ బయనంబుసాగించె
బొబ్బిలికిని బొత్తము వినిపింప. 174

సీ. ఈకృతినాథుఁడై యొసకవిస్మృసంగు గంగాధరరామరాట్ప్రభుని రెండ
వ కుమారునకు సప్తవర్షప్రాయంబగుచున్న సమయమున, స్మృతిలయంబు గాక జనవిభుండు
బొబ్బిలిరాజన్య సభ్యాంగు సమకొనిమాకికిని నప్పుడే మహోద
యంబుమైఁ బెండ్లి యాలాపయుండె సర్వంతయు సుఖముల సేవమీఱు

తే. గీ. నట్టి తఱి బొబ్బిలిని గొన్ని యానాము లుండి
పైని సమయంబొసఁగి ధరాపతియు రాజ
బంధువులతోడ వినఁ గావ్యబంధమును మ
నోహరముగ వెంకన్నయును వినిపించె. 175

తే. గీ. వేయిపై నూఱునాఱును విలువ మిగులు
నేలు జోడును భూపాలశేఖరుండు
గౌరవమొనర్చి యొసఁగెఁ గవికి నూఱు
లార్లు పంపించు నేరుపా టమరఁజేసె. 176

ఆ. వె. అంతఁ బోక శిష్యులందఱకొక్క నూ
టా టొసంగి యిట్టు లఖిలగతుల
నాదరించి పంపె నవనీశ్వరుం డాత్మ
వితరణంబు సుకవితతి పొగడ. 177

క. అటు గౌరవింపఁబడి వేం, కటకవి తనగ్రామమునకుఁ గడియమ్మున ను
త్కటముదముతోడఁ జనె, మిక్కుటముగ నరపాలు మెచ్చికొనుచుఁ బేర్మిన్.

తే. గీ. ఆంధ్ర 'యునివరిసిటిఁ' బరీక్షాధికార
మున్న హేతువునంజేసి యొక్కకొంత
ధనము లభియించె నీగతిఁ దద్ద శుభవి
ధాయకంబుగ రాహునంతర మెసంగె. 179

క. స్థిరవసతియుఁ జరవసతియు, మఱికొంత లభించెఁ, గొంత మాతామహుసు
స్థిరయుఁ గలిసె; నీగతిఁ దా, మరతంపరగా ధనాప్తి మఱిమఱి యొనరెన్.

క. రెండవ కొమరునకుం గడు, గండుమిగులు జ్వరము వచ్చి కడ కది యొంతో
గండముగఁ బరిణమించియు, బెండుగతిన్ సురిఁగె నింటివేలుపు కరుణన్.

ఆ. వె. అమితధనము కుజుని యంతరమ్మున లభి
యించుఁగాక యంత కెచ్చుగాఁగ
వ్యయము నయ్యె; వీని యంతరం బటుగాక
వ్యయము తగ్గె, లాభ మధిక మిడియె. 182

చ. అఱువది యేఁడు లాయువని యుల్ల ద్విభాషికులుండు వేంకటే
శ్వరబుధుఁ డల్లు వ్రాసె, నది జాతకమం దపు డేగుదెంచె, నీ
శ్వరకృపఁ దల్లికడ్పుచలువన్ మరణంబు ఘటింపకుండఁగా
కటిముటి గండగండముగ నత్తటి వెంకన కేగె నెట్టులో. 183

క. ధనభూసంపాదనములి, తనకి ఘటించుటయు కాక ధనభూదానం
బున నీతఁ డొరులఁ దన్పుట, యును జేకురె రాహునం దనూనప్రీతిన్.

తే. గీ. ఒక్క రాహ్వంతరమునఁ గా దిక్క వీని
జాతకమునకు గురుదశ సంఘటిల్లి
నది మొద లెసంగె సంతతం బన్నదాన
మన్నపూర్ణామహాదేవియతులకరుణ. 185

తే. గీ. తాను నూటార్లు గైకొను తజ్జ్ఞుఁడగుట
నొరుల కష్టప్పు నూటాఱు లొసఁగు భాగ్య
మితనికి ఘటించె గురుదశ, యిదియ కాదు
రాహుదశ గూడ నీ యుదారత ఘటించె. 186

క. ఈయీవి తనకుఁ గొమరుల. కాయత మారోగ్య మిడిన యాయుర్వేద
శ్రీయుతుఁడు వేంకటేశున, కా యలఘుఁడు రామమూర్తి కని యెఱుఁగఁదగున్

తే. గీ. బహుమతికిఁ గాని పద్ధతి బహుళధనము
గురునిలోఁ జందురుఁడు రాహు గూడ వైద్య
మునకుఁ గర్చుపెట్టించెను; బూర్వపు దశ
లేవియును గర్చుపెట్టింప విట్లు ధనము. 188

తే. గీ. నూజివీటి షార్షికమున కోజఁ జని క
రంబు సింహాద్రి శ్రీ యప్పరావుచేత
గౌరవింపఁగఁబడి యింటి కరుగుదెంచు
నంతఁ జీరాలపుగిఁ షాము లటకు వచ్చె. 189

ఆ. వె. స్వపురమునకు గౌరవపురస్సరమ్ముగాఁ
దీసికొనుచుఁ జనియు దీపమహోత్స
వంబుఁ జేసి రట్టి వైభవంబున మించి
యింటి కేగుదెంచె నితఁడు పిదప. 190

ఉ. కాఁకరపర్తి బంధు[illegible]రసబంధుల కోర్కి విందుఁ దా
నీకవి ధాత్రి[illegible]మూగాఁ జను; నేగినంత వా
రేకముఖమ్ముగాఁగ [illegible]గియు నూరున నేగఁజేసి ర
స్తోకపు మే[illegible]లతో నసద్వ్యతరాదరంబుతో. 191

తే. గీ. ఆత్మబాంధవులగువారి యాదరమున
నప్పురమ్మున సభ నుపన్యాసము లొక
రెండు మూఁడిడి తగ నలరించి వారి
నింటి కేతెంచె నీకవి యొసక మెసఁగ. 192

ఆ. వె. సోమనాస్వామ్యనుజుండు శ్రీకామేశ
రా వొనర్చెఁ బెండ్లి రాజమహేంద్ర
వరమునందు మేటి వైభవం బలరార
నతని పేర్మిఁజేసి యరిగె నటకు. 193

క. సకుటుంబమ్ముగ నిటు పెం, డ్లికిఁ జని యట జరుగు నక్కడింది మహాము త
క్కక గని యాగేస్తానఁగిన, ప్రకటతరపు గౌరవమ్ము వడసియుఁ బిదపన్.

క. మురుమండ దేవుకళ్యా, ణరమునకుఁ దత్పురవరంపు నరనాథుని యా
దరముకతనఁ బూర్వమువలె, నరిగి యచటి యుత్సవమ్ము లరసియుఁ బిదపన్.

తే. గీ. అన్నవరమున సత్యనారాయణునకు
జరుగు పెండ్లికిఁ జని యట సకలగతుల
నుత్సవమ్ములఁ బాల్గొని యొగిఁ బ్రకాశ
రావుతోఁ గాలయాపన రహి నొనర్చె 196

తే. గీ. బంధులవియును స్నేహసంబంధులవియు
నుత్సవము లట్టు లెన్నెన్నియో కనంగఁ
జేయుటయు కాక తనయింటఁ జేయఁజేసె
రాహువు శుభమ్ములను గడు రాణ యొసఁగ. 197

తే. గీ. అరుగుదెంచుచు రాహు తా నల్ల లక్ష్మి
నరసపురపుజమీందారు గరిమ నొసఁగు
నూఱులాఱులు మఱియు ననూనమైన
యయ్యధిపు నాదృతియును సొంపారఁ గూర్చె. 198

తే. గీ. బంధుసంబంధమైన యాపత్తు, లింట
నప్పుడప్పుడు దూరుజ లలము, టాత్మ
దేహమున వార్ధకత్వపరిదీప్తి తక్క
సకలవిధముల రాహు వొసంగె సుఖము. 199

తే. గీ. రాహునంతర మొకటి మాత్రంబ కాక
గురుమహాదశ సర్వ మిక్కరణి నెగడె;
ధన మొసఁగె, ధాన్యవృద్ధి సంతానవృద్ధి
నొసఁగె, భూవృద్ధి గోవృద్ధి నొసఁగె నెలమి. 200

క. అవయోగము గడుఁ దక్కవ, సవిశేషంబుగ సుయోగసంఘటనంబుల్
దవిలించి గురుమహాదశ, కవి వెంకన జాతకమునఁ గడచె శుభగతిన్. 201

ఆ. వె. సమయమునకు జ్ఞప్తిచాలక యీగురు
దశను జేర్పఁదగిన తత్తదంశ
ము లవి యెన్నియేని గల వందులో ముఖ్య
ములగువానిఁ గొన్ని దెలియ వినుతు. 202

ఆ. వె. అన్నవరపుదేవు నంతికమ్మున నిను
గంటివంశ్యుఁ డల వరికాశరావు
కొమిరె పెండ్లియుత్సవము కడు వైభవ
మలర జరిగె దాని కరిగె నితఁడు. 203

తే. గీ. అతఁడు నూఱార్లు నేలువు లితని కిడి బ
హూకరించె; నిది యిటుండ నొకట నరస
పురమునందు శాకుంతల పుస్తకమును
గూర్చి జరిగెఁ గొండొక సభ కుతుక మలర. 203

క. దానికి నితఁ డధ్యక్షుం డై నరసాపురపు సభ్యు లానందింపం
గా నది కృతిగొను పానపలి, శ్రీనిలయుఁడు సోమయాజిచేఁ గొనెఁబూజల్.

ఆ. వె. తణుకులోన నొకటఁ దగ నాంధ్రభాషాప
రిషదనూసభకు నరిగె నితండు
అపుడు మండపాకయందలి నైగినల్
పిలిచి సత్కృతులను సలిపి రెలమి. 206

క. శ్రీరుచిర మోతె సంస్థానపు నారాయణరావు పిలిచి నాటకపుమిషఁగా
దా నొసఁగె నూటయాఱులు, శ్రీనెగడఁగ మృచ్ఛకటి రచించినతనకున్.

తే. గీ. మఱియుఁ బాండవవిజయమ్ముఁ దఱచు నాడు
బందరు పురీనటకు లొక్కపరిఁ బ్రదర్శ
నమున కాహ్వానమును బంపి ప్రమసమొసఁగ
నూటయాఱు లొసంగిరి గౌరవముగ. 208

తే. గీ. పాలకొల్లున మును పాక భారతంపుఁ
గృతిసభకు నేగి కొనె బహూకృతు లితండు
వెండి శ్రీకృష్ణభారతం బొండొకండు
కృతిగొనుచు నీతనికి బహూకృతు లొసంగె. 209

తే. గీ. మఱియు గుంటూరిసీమను గరము పేరు
గల్గు శ్రీ వేటపాలెపు గ్రామమున నె
సంగు పౌరు లొండొకపరి సభకుఁ బిలిచి
గారవించిరి పేరిమి గడలుకొనఁగ. 210

సీ. సుప్రసిద్ధుండు పూర్ణప్రజ్ఞకవివరుం డాంధ్రీకరించె బాణాభిధాన
కవికృతంబౌ నల కాదంబరీగ్రంథ మద్దానిఁ దన మామయైన కాశీ
కృష్ణార్యసుకవి కంకితమిడెఁ దత్సభ కీతఁ డధ్యక్షుఁడై యేగె నప్పు
డాసభఁగూర్చిన యనఘుఁడు రత్తయ్యపంతు లీతని కిచ్చె బహుమతులను

తే. గీ. మొగి నటకు వచ్చి జాగర్లమూడి కమ్మ
వంశ్యు లెంతయు భక్తిప్రపత్తు లలరఁ
దమదు సూరికి రప్పించి తగినభంగి
సత్కరించిరి కొండొక సభ నొనర్చి. 211

ఆ. వె ఆప్రియాణమందె యనఘశిష్టాకుల
జుండు హనుమదాఖ్యపండితుండు

బహుమతిగను రాంకవప్రదానంబున
సత్కరించె భక్తియుత్కటముగ. 212

క. ఏఁటేఁట గణపతికి నొక, నాఁటకన్ శ్రీరాణ్మహేంద్రనగరకళాశా
లాటకులగు విద్యార్థులు, పాటించి యొనర్తు రుత్సవము భక్తి మెయిన్. 213

తే. గీ. బందరునను వీడి కడియము వచ్చుటాది
యింతవనుకఁ దత్సభ కీతఁడే యధీశుఁ
డగుచు నేఁటేఁట నట నుపన్యాస మిచ్చు
ఘనుఁడు విస్సాప్పరాయని కారణమున. 214

ఆ. వె. మఱియు రాణ్మహేంద్రవరమున శ్రీ చల్ల
పల్లి యారువేలవారి యింటఁ
బరిణయమున నొకట జరిగె నెక్కుడు సభ
తిరుపతియుఁ గలండ దీనియందు. 215

తే. గీ. గుండ్లపల్లె సాంబమూర్తియుఁ గొమిరెపెండ్లి
చేసెఁ దూరుపునుండి విచ్చేసెఁ బెండ్లి
కొమరుఁ డగ్రహారికుఁడును భమిడిపాటి
కులుఁడు, వీ రవధానంబు సలిపి రపుడు.

తే. గీ. ఆంధ్రభాషాపరిషదాఖ్యమైన సభ యొ
కంట నెలూరిలో జరుగంగ దాని
కీతఁ డధ్యక్షపదవికి నేగె సభ్యు
లట్టు లెన్నుకొనుటఁజేసి యాదరమున. 217

క. నాళము కృష్ణారాట్కవి, శ్రీలలరఁగఁ నూఁతుపెండ్లిఁ జేసి పిలిచి యు
ద్వేలగతి సత్కరించెన్, హేలగ వెంకనను రాణ్మహేంద్రపురమునన్.

తే. గీ. విజయనగరపురమునుండి విట్కులజులు
తరలి వచ్చిరి రాణ్మహేంద్రవర మొకట
నప్పు డాహ్వానమంపి వెంకనకు సభనొ
నర్చి రెక్కుడు సత్కార మర్చ యొలయ. 219

తే. గీ. మొల్లమగు పేర్మి గొద్దనాపల్లెలోని
సుప్రసిద్ధుఁడు వంతమునుకులజుండు

శ్రీదుఁ బోలెడి కాపు విశిష్టగుణుఁడు
సూర్యరావు బహూకరించుటకుఁ బిలిచి. 220

వ. "మీ రెప్పుడో పెండ్లికి నిట, నూరేగిరఁట! పుట్టకుంటిని చేసె నెట్లారయఁగల్గుదు నది? యిపు, డూరేగింతు"నని చెప్పి యూరేగించెన్. 221

తే. గీ. ప్రత్తిపాడు 'మేజస్ట్రీటు' పదవి నలరు
నల జగన్నాథరావు లింగాన్వయజుఁడు
కొమరునుపనీతికయి గౌరవముగఁ బిలిచి
సత్కరించె సభను భక్తి యుత్కటముగ. 222

తే. గీ. ఉండిలో భీమవరములో నొండు సభలు
జరిగె; గుడివాడ మునుపటి సభయు కాక
మరలఁ దుమ్మలవలె పేరఁ బరఁగు శిష్యు
నింటి పెండిలి కేగెను నీతఁ డెలమి. 223

తే. గీ. పెండిలికి నేగుటయ కాక భీమనాథ
దేవుకళ్యాణమునకు నంతేవసత్ప్రి
యత్నమునఁ జాలసార్లీతఁ డరిగి ధర్మ
కర్త యా శిష్యుఁ డిడు పూజగొనె నితండు. 224

ఆ. వె. ఇంక నెందెందఱేనియు నిటు లాచ
రించు గౌరవములు మించి యెన్ని
యేని గలవు జ్ఞప్తి కెలమిమైఁ దవిలిన
వట్టి సంగ్రహముగ వ్రాయఁబడియె. 225

వ. ఏవిషయము సంగ్రహముగ, నే వ్రాయంబడియె నిం; దిటే కానున్నన్ బ్రోవులు పోవులు గాఁగన్, దైవారు నెఱుంగుఁ డీకథాకథనంబున్.

తే. గీ. ఒకటి మచ్చునకై యిందు నొక్కకొంత
విస్తరించి వచించెదఁ; బెండ్లి తనదు
కొమిరెలకు వెంకన యొనర్చెఁ బ్రమద మెసఁగ
ననుచు వ్రాసితి నట నెంతయైనఁ బెరుఁగు. 227

వ. ఎటులందు రేని మన వెం, కటకవి కొమిరెలకుఁ బెండ్లి గావించుటకై
స్ఫుటముగ నిర్ధారకును నొ, క్కటిగా సుముహూర్త ముంచఁగా నప్పట్లన్,

తే. గీ. ఏమిచెప్పుదు దైవేచ్ఛ! యింకఁ బెండ్లి
యాఱు రోజులలో నున్నయపుడు రెండ
వ కొమిరె వరుండు మోటారువలని బల్ ప్ర
మాదమునను లోనయి ప్రాణ మూఁడియుండె. 229

తే. గీ. ప్రాణభయము లేకున్నను నంగభంగ
మబ్బునో యేమొ 'హాస్పటు'లందుఁ గట్లు
గట్టుచున్న యావ్యానికిఁ గన్నె నొసఁగ
నీతఁ డొప్పిన నొప్పట యెట్లితరులు. 230

తే. గీ. మునిఁగిపోయిన దేమి, యాతనికి నిచ్చు
కన్నె పెండ్లి యప్పటి కాపి చిన్నివరుఁడు
దుస్థితికిఁ దప్పుపిదప నెందుల కొనర్ప
రా దనుచుఁ బ్రాజ్ఞులైనవారలు వచింత్రు. 231

తే. గీ. కాని యది "శారదాబిల్లు" కాలమగుటఁ
గన్యకలఁ దల్లిదండ్రులు కాళ్లుగడిగి
ధారవోసెడి కాలము దాఁటిపోవు
ననెడి భయమునఁ దొందర గొనఁగవలసె.

క. కన్నియకు నాలుగవయేఁ డెన్నఁగ వరునకుఁ బదేఁడు లీ బిల్లౌ తే
కన్నన్ దొందరయే లే, దున్న నితం డేల దీని కొడఁబడె నన్నన్. 233

తే. గీ. ఇతఁడు "శారదాబిల్లున" కించుకేని
జంకఁ డది యేమటన్న, సంస్కర్తృపక్ష
పాతి గాఁ డితఁ డీతని భావ మిచట
విస్తరించెదఁ బ్రాజ్ఞులు వింద్రుగాక. 234

తే. గీ. దేవునాజ్ఞయు రాజునాదేశ మివియు
రెండెకద తప్పకే యాచరింపఁదగిన;
వందు రాజాజ్ఞఁ దప్పి యిహమున, దేవు
నాజ్ఞఁ దప్పి పరంబున నందు ఫలము. 235

క. పరదండనమ్ము కన్నను. బరమభయావహ మిహంబునట్టున నగు న
న్నరక, మ్మకృతమున ని, న్నరు లెంతయు జంకుదురు జనవరున కెందున్.

తే. గీ. ప్రౌఢయగు కన్నియను వివాహంబు సేఁత
నరకహేతువె యగుఁగాక ధరణినాథు
శాసనమ్మున నందుకు సమ్మతించు
నరులు తత్పాపఫలమును బొరయఁబోరు. 237

క. ఏమన్న, రాజశాసన, మేమానవుఁ డేని దాఁట నెటు శక్తుండౌ ?
నీమెయిఁ బాపం బది యా, భూమీశుఁడె పొందు నంతఁ బొందవలసిన౯.

తే. గీ. ఇట్టి దృఢనిశ్చయం బున్న యితఁడు పెండ్లి
బిల్లునకు జంకు ననుకొంట పిచ్చిమాట
ఐనచోఁ "గొంతకాల మెట్లోఁగఁ డయ్యె"
ననెడి మాటకు నుత్తరం బవసరంబు. 239

క. తనకు నిరువురే కూఁతులు, కనుక నిపుడు పెండ్లిచేసి గండమ్మది దాఁ
టినచోఁ బిల్లుపలని యా, తన తన కుండదని యతఁ డెదం దలపూనె౯. 240

తే. గీ. దాని కంతరాయ మ్మిట్టు తారసించె
వ్యవధి లేదని యెంచి యావరుని తాత
గారు సోమయాజులఁ బిల్చి ఖండితముగ
వేంకటేశ్వరకవి మదిఁ గొంకు దక్క. 241

క. పలికె నిటు, "లే వచించెడి, పలుకుల యర్థంబు మీరు బాగుగ నెలమి౯
దల కెక్కించుక యుత్తర, మొలసినగతి నొసఁగ మిమ్ము నొగిఁ బ్రార్థింతు౯.

తే. గీ. మొదట మా పెద్దకుట్టి కిమ్ముగను మీదు
మనుమరాలిని జేసికొ మ్మనుచు వాని
వడుగునకు వచ్చినప్పుడు కడుఁగడు౯ బ్ర
యత్నపూర్వకముగ మీర లంటి రెలమి. 243

క. అంతటి యదృష్ట మది భగ, వంతుకరుణ మాకుఁ గలుగుపట్టున నెంతో
సంతోషమ్ముగ మీపూ, చ్చింతితకార్యప్రసిద్ధి చేకురుత మొగి౯. 244

క. అని చెప్పిరయి నటుజరుపక, తనయున కింకొకరి కన్యఁ దగఁ బెండిలిచే
యను సిద్ధమైన తతి మీ, ర్నను గట్టిగఁ బట్టు పట్టినారు కడంక౯. 245

తే. గీ. అపుడు పేనంటి "మీకు వియ్యమ్ము నెట్టు
లేని మాతోడ నందులే యిచ్చయేని

నాకొమారిత మీదు మన్మనికి నిత్తు
నెవ్వనికి నేనిఁ జేసికొం డెలమి ననుడు. 246

తే. గీ. మంచిదని పెద్దకొడుకు కుమారునకు ఘ
టింపనెంచితి రట్లె ఘటింప నేను
సమ్మతించితి దానికి సమయమునకు
నంతరాయ మ్మొదవె దైవ మట్టిదగుట. 247

క. మంగళసూత్ర మ్మె చే, తం గట్టన్వలెనో యదియొ తద్దయు నిపు డుం
డెం గట్టుఁబడిని, నెటు లి, త్తుం గన్యక నతని కేను దొందరపడుచున్. 248

ఆ. వె. ఆఁగి చేతమన్న నధిపుళాసన మది
పెద్దపులియుఁ బోలె వేచియున్న
దక్కతమున నిట్టు లాచరింపుఁ డుపాయ
మొకటి నాకుఁ దోఁచె నుల్లమందు. 249

తే. గీ. మీకుఁ గొమరులు నల్వు రమ్మేటు లంద
ఱికిని గలరు కుమారు లర్మిలిని వారి
యం దొకనిఁ బెండ్లికొమరుఁ జేయంగ మీకు
సమ్మతమయేని నే నట్లు సమ్మతింతు. 250

తే. గీ. ఆదియందు నే నాడినయట్టి మాట
మన్మలని మాత్రమేకదా! మాట కిపుడు
నన్యథాత్వంబు గలుగమి నవుల నాకు
నంతగా నపయశ మబ్బ దనియుఁ దలఁతు" 251

తే. గీ. అనవుడును సోమయాజులు నట్లె సోము
దమ్మయును సమ్మతించి తత్తనయులందు
"రెండవ కుమారకొమరున కిం" డటంచుఁ
బలికి రట్లనె యని యొప్పఁబలికె నితఁడు. 252

క. జరిగె వివాహము పిమ్మట, సురుచిరగతి, నిట్టె యన్నిచోటుల వ్రాయం
బెరుఁగున్ గ్రంథము కావున, నటిముటఁ గ్లుప్తముగ సకల మల్లితి నిందున్.

తే. గీ. పిదప ఘోటాసనం బడ్డ పెండ్లికొమరు
నకును బెండిలి తనకూఁతు నాకబలిమ

హమ్మనాఁడె యెటో నిశ్చయంబో వచ్చి
జరుగునటు చేసె వేంకటేశ్వరుఁడు పేర్మి. 254

ఆ. వె. అవులఁ గొన్ని నాళ్ళకా గాయములు మాని
చక్కనుండె మొదల సంశయమునఁ
జిక్కికొన్న వరుఁడు, చేయఁగ మానఁగ
నోరుఁ డెవండు పైన మొకఁడు దక్క! 255

క. ఇంతటి సూత్రములకు స్ఫు, ర్తిం దెలియంగఁ గూనాయు లేఁదుప నలరా
ట్సందర్శనమ్ము చదివిన, సందేహనివృత్తి కొంత జరుగఁగవచ్చున్. 256

తే. గీ. పుక్కిటిపురాణకల్పనముల నొసఁగు
వారు గాక యెల్లెడలను వాస్తవప్ర
చారము వచించు శిష్యులు సారమతులు
గలరు వారలు సందర్భములు వచింత్రు. 257

క. అని యెంచి కడుంగడుఁ గ్లు, ప్తనియతి నిడికూర్చఁబడియె బహుళశుభములెం
దు నొసఁగి గురుఁడేగుటయున్, శనిదశ ప్రారంభమయ్యె సంతసమెసఁగన్.

ఆంగీరస సం॥ ఆషాఢ బ ౧౮ మొ॥ ఖర సం॥ ఆషాఢ బ ౧౮ వ॥ శనిమహాదశ.

ఈ శనిమహాదశాప్రారంభమునకు వయస్సు
౬౧ వత్సరము పైని ౧౧ మాసముల ౧౭ రోజులు.
యువ సం॥ శ్రావణ శు ౨ వ॥

—: శనిమహాదశలో శన్యంతరము :—

ఆంగీరస సం॥ ఆషాఢ బ ౧౮ మొ॥ పుష్య బ ౫ వ॥

—: శన్యంతరములో శనివిదశ :—

ఉ. శ్రావణభౌమవారపుమిషన్ భగవత్యవతారమైన శ్రీ
దేవి ననామయంబు సిరి దీప్తియు నాయువు కీర్తి నిచ్చు బల్
పావనిఁ గొల్చు నాత్మజులభార్యలుఁ గూఁతులు సంతసంబిడన్
దైవతభక్తియుక్తిని ముదంబునఁ గొండొకరోజు లేగుడున్. 259

ఆ. వె. ఇంట జ్వరపుఁబీడ లేర్పడెఁ గాని భ
గవతికరుణ శీఘ్రమవియుఁ దగ్గ
నంత బంద రీతఁ జరుగఁగావలసిన
గ్రాసనాధిపత్య మధికరింప. 260

ఆ. వె. అరుగు మార్గమున ననారోగ్య మేర్పడెఁ
గాని యదియుఁ గొంత కష్టపెట్టి
నను గ్రమక్రమమున వెనుకదగ్గుటఁజేసి
సభ జయప్రదముగ జరిపె నితఁడు. 261

క. పింగళి లక్ష్మీకాంతున, కుం గలిగినయట్టి వృద్ధిగూరిచి సభలో
సంగతముగఁ జర్చించి యొ, సంగి రతని కెలమి నొక విజయపత్రమ్మున్.

తే. గీ. అతని వృద్ధికి నితని శిష్యతయె ముఖ్య
హేతు వని చెప్పి యీతని నెంతయేని
గౌరవించిరి వస్త్రాదిక మ్మొసంగి
జరిగె మఱికొన్ని సభలు నచ్చటను బిదప. 263

క. హేరంబచతుర్థికి నితఁ, డారన్ స్వగ్రామమునకు నరుదెంచె శరీ
రారోగ్యము మరలఁ జెడియు, నారోగ్యముగలిగెఁ గొన్ని యహములలోనన్

ఆ. వె. అంతఁ జిన్ని కొమిరె యారోగ్య మది చెడి
మిగులఁ జిక్కునెట్టి భగవతీకృ
పాకటాక్షమున నభయమబ్బె నది గల్గ
నెట్టి రోగమేని యేమి సేయు. 265

క. పదపడి దేవీపూజా, స్పదములు నవరాత్రములు శుభప్రదములు స
మ్మదమిడుచు వచ్చె శక్తికొ, లఁదిగ సపర్యంబొనర్చె లలితాంబికకున్. 266

తే. గీ. సన్నిహితబంధుమృతిఁజేసి కొన్నినాళ్ళు
మది ముదము దక్కినను దన సదనమందు
నెపుడు బంధుజనులు నిండి యెలమిగొల్పు
కతన నక్కాలమును సుఖకరమె యయ్యె. 267

తే. గీ. అవులఁ బ్రద్యుమ్నభూమిపుఁ డంపె వార్త
"బొబ్బిలినృపాలకుఁడు తన ప్రోలి కేగు
దెంచుఁ గావున రాకున్నఁ దీర" దనుచు
నరిగె లక్ష్మీనరసపురి కంత నితఁడు. 268

క. అనుకొన్నయట్టు లపుడా, జనపతి చనుదేరలేద, దయ్యునఁ బిలిపిం
చిన ప్రద్యుమ్నమహీపతి, యనిపెన్ సత్కృతి నొనర్చి యాదృతి మెఱయన్.

సీ. బందరు జేరినప్పుడె సభన్ "దమ కేఁటిటియందు షష్టిపూ
ర్తిం దమి సెవ్వరో నృపవరేణ్యుఁడు చేయఁదలంచినట్లుగాఁ
గొందఱు చెప్ప వింటి, మది కొంచెపుఁగార్యము గాన, దైనచో
నిందఱలోనఁ గొందఱము యేనియుం వచ్చియయుందు మందురేన్. 270

క. కాన జరుగలేదనియే, మానమ్మిక" యనుచు పదుగు మాటకుఁ "గాదే
దేనే కారణ మందుల, కైనే యనుకంజయిడితి ననస్థితచే. 271

తే. గీ. దాని కెన్నియొ మంత్రతంత్రములును జప
హోమములు నుపోషణములు నందు బట్టు
లుండ నఱువది యేఁడులు నిండుపుడ
కాపలయునన్న నియమంబు గలదు గూడ. 272

ఆ. వె. అట్టి నియమములకు నాబాల్య మే నెప్డు
కట్టుపడుచునుండు కార్యములకుఁ
బూనఁజాల నిఁక నిపుడు వృద్ధదశ యాట
మఱియుఁ బూనలేను మాట నిజము. 273

తే. గీ. ఇంతకును షష్టిపూర్తికి నేమి ఫలమొ
యనియుఁ గూడ విచారింప నాయుః ప్రధిక
మగుట కనియు సంకల్పము యాపఠిచ్చె
నందుకు యతించుటయుఁ గడు నజ్ఞమతము. 274

తే. గీ. అదియుఁగా కట్టి కామ్యకర్మాచరణము
జరుపుటన్న యథావిధి జరుపవలయుఁ
గానిచోఁ దక్ష్లలంబును గాంచు టరిది
యందుకు మహాధనాఢ్యులే యర్హులెందు. 275

తే. గీ. కల్పమునఁ జెప్పఁబడిన తత్కార్యమునకు శ
తాంశమేని గావింప నవర్హులైన
వార లిట్టి కృతులు సేయువారలేని
యంతకన్నను పరిహాస్య మన్య మేది? 276

తే. గీ. సస్యగర్భభూదానంబు సలిపెనంట
వెనుక నొక యాపె యది మీరు వినఁగలేదె?

యిందుఁ బదియాఱు దానమ్ము లిడుటగూడ
విధి యదియు లేమి సర్వ మవిధియ యగును. 277

క. అకరణతఁ బ్రత్యవాయజ, నకములు సంధ్యాభివందనము లోనౌ బల్
సుకరపుఁ గర్మము లవియె మ, నకు జరుగవు షష్టిపూర్తి నగుఁబాటేమో.

తే. గీ. ఇంత కాసమయమ్మున కేను దగిన
యంత యారోగ్యమున లేమి నాతరుణము
దాఁటె" నన నష్టుడైన సదస్సులోని
శిష్యులుఁ బ్రశిష్యు లిట్లు వచించి రెలమి. 279

క. "మీ రనినది వైదిక మిపు డారయఁగా వారివారి కగుచుండిన యా
తీరు సమస్తము లౌకిక, మీరహినే షష్టిపూర్తికృతి మీ కెలమిన్. 280

తే. గీ. జరుపనెంచితి మిపు డిట్లు జరుగు" ననుచుఁ
గొన్ని యంశములను నందుఁ గొంద రెలమి
ముచ్చటించి రాసమయపు ముచ్చటలను
బలపఱచి కృష్ణ ప్రకటించె భాసురముగ. 281

తే. గీ. అప్పటప్పటఁ బత్రికలందుఁ దఱచు
షష్టిపూర్తిని గుఱిచి ప్రసంగ మెత్తి
కొని దిగంతములందలి కొంద ఱేమొ
వ్రాయుచుండిరి యత్నము సేయుచుండ్రి. 282

క. ఇది యిట్టులుండె మఱి శ్రీ, పద శ్రీయుత కృష్ణమూర్తి భారతకృతిసం
పద కలరి యాంధ్రలోకము, ముదమున సత్కృతి యొనర్పఁబూనెఁగడంకన్.

తే. గీ. మఱియు విక్రమ దేవవర్మ మహీపాలుఁ
డల్ల సత్కారసభకు నధ్యక్షుఁడగుచు
నెలమి దయసేయుననుచును నెల్ల పత్రి
కలను బ్రకటితమయ్యె నఖండరీతి. 284

క. ఆనృపు డేకారణమో, గాని యటకువచ్చు భాగ్యగరిమమ్మునకున్
దా నోఁచఁడయ్యె నప్పనిఁ, బూనె నితఁడు రాణ్మహేంద్రపుర మునుగుటచేన్.

ఆ. వె. అట్లు పూని గురుని యంఘ్రికి గండపెం
డరము దొడిగి గురు నెడంద నున్న

సందియమ్ము దీర్చి జగమునన్నతికి నీ
తండు పాత్రుఁడును గృతజ్ఞుఁ డయ్యె. 288

క. గురునెడఁద నున్న యయ్యలి, మర యొట్టిదటన్నఁ గొంతమంది గురువరు
న్నిరసించి వ్రాసి యుండె, త్తిరి వెంకనపేరు దానితెలిఁగిట నిడుదున్.

శుక్ల సం॥ మాఘ శు ౧ా శనివారమునాఁటి కృష్ణాపత్రికనుండి.

—: కవిసార్వభౌమ సమ్మానము. :—

"............ కవిసార్వభౌమ బిరుదము శ్రేష్ఠార్థవాచకమా? అట్లే యైనచో కవిరాజపదమునకు మాఱు సార్వభౌమపద మేల? లేక "సర్వభూము లందును కవి" యను నర్థమా? అట్లైనచో బ్ర॥ శ్రీ చెళ్లపిళ్ల వెంకటశాస్త్రి ప్రభృతులకుఁ గల స్థాన మెయ్యది...... ఒకవేళ భారతాంధ్రీకరణవ్యాజమునఁ గాకున్నను, కేవల సాహితీపరముగనైనను కృష్ణమూర్తిశాస్త్రి గారు ప్రస్తుత కవిసార్వభౌమ బిరుదమునకు ఎంతవఱకు అర్హులు కాఁగలరా అని యోజింపఁ బూనినను కృష్ణమూర్తిశాస్త్రి గారు సంస్కృతభాషావిశారదు లనఁబడు ప్రసిద్ధ పురుషులలోఁ జేర్పఁదగినవారుగఁ గన్పట్టరు. ఏయొక్క శాస్త్రమునం దైనఁ గాని పారీణులైనవారుగనైనను భావించుట కవకాశము గన్పట్టదు. అదిగాక సుప్రసిద్ధ శతావధానులైన బ్ర॥ శ్రీ చెళ్లపిళ్ల వెంకటశాస్త్రి గారి యందున్నంత కవితాలాలిత్యము గాని వ్యంగ్యప్రాగల్భ్యము గాని రామణీయకత గాని వీరియం దంతగాఁ గానరా దని చెప్పనగును. ఇంతకును చెళ్లపిళ్ల వెంకటకవిగారి కీయన యెప్పుడో యే మేఘసందేశస్థశ్లోకద్వితయమో చెప్పినందున వారికృతజ్ఞతాస్వభావమునకు పాత్రుఁడగుచున్న గురుత్వమే వీరిని గాపాడికొనివచ్చుచున్నది. కాని యంతకంటె వీరి ప్రతిభావిశేషము కాదని నేను జెప్పఁగలను." బ్రహ్మశ్రీ పరిమి నరసింహశాస్త్రులు గారు మాతో నిట్లు చెప్పిరి. "అయ్యా శ్రీ శిష్టా నరసింహశాస్త్రులు గారు కవిసార్వభౌమస్వర్ణాభిషేకవిషయమునఁ జెప్పిన వాక్యము లన్నియు నాకును నభిమతము లయినవియే. ఈయూరిలో జరిగిన సభకు నన్నెవ్వరును పిలిచియుండలేదు కావున నా నాఁటి సభలో నాయభిప్రాయమును వెలువరించుట కవకాశము కలుగలేదు."

---

క. ఇది యొండును "వైకర్తన", పదార్థమును నిర్వచించుపట్టునఁ "జింత్య"
మ్మిది యని గురునఁడి నంటయు, నదియు నిట నుదాహరింప నతివిస్తృతమా.

(1923 సం॥ మార్చి 24 తేదీ కృష్ణాపత్రికలోని జలతాడనము చూడుఁడు.)

తే. గీ. ఇదియునుం గాక గురువుగా నెవరి నుద్ర
యోగములనో యెదో కోపమూని యొవరి
పేరనో తప్పులని వ్రాయ వారు వచ్చి
యితనిఁ గోరిరి "సత్య మిం దెంత" యనుచు. 289

తే. గీ. దానిపై నున్నవట్టు యథార్థ మితఁడు
వ్రాసియిచ్చెను వద్దాని వారు మదిని
తంబొనర్చిరి తక్కు విద్వద్వరేణ్యు
లిడినవానితోఁ బాటుగ; నిది యొకండు. 290

క. కలిసి గురుమానసమ్మును, గలఁకపఱుప నచ్చటచటఁ గడుఁ బరుషంబుల్
వలుకుటయ కాక యూరక, విలిఖింపఁ దొడంగి రదియు వివరింప నిటన్.

(దురద్ధరదోషశృంఖలము అను శ్రీవారి పుస్తకపుఁ టీకలో చూడుఁడు)

క. శ్రీవారి యక్కరము లవి, దైవారఁగ నున్నచోటు తగఁ దెల్పితి నిం
కా వారి యనుచరులవో, నా వాక్కులఁ గూడ నిందు నతుకక విడుతున్.

(హైదరాబాదు డక్కన్ ఓగిరాల సుబ్బారావుగారి యుత్తరములో చూడుడు)

క. అతివిస్తర మెందుల కీ, ట్లతితరకోపమున దేశికాగ్రణి మదిలో
నితికర్తవ్యం బరయక, కృత మెఱిఁగిన శిష్యుపై వికృతిఁ జూపింపన్. 291

క. వెంకనకు దీనికతనఁ గ, ళంకము రాకుండుఁగాక; లాఁతులు గురుపైఁ
గొంకక తిరుగఁబడెడి యా, ప్పంకము పైఁచు టది తనకుఁ బాపమ యనుచున్.

క. చేయునది లేక శాంతికి, నై యొక వ్యాసంబు సంగ్రహమ్మును బుద్ధిన్
బాయక లిఖించి పత్రిక, కై యిడెఁ బ్రకటింప నదియు నతివిస్తృతమా.

(11 ఏప్రియల్ 1931 సం॥ కృష్ణాపత్రిక చూడుఁడు)

తే. గీ. ఒకడినయప్డు సుగుణసంపదను జెప్పి
తీగవలె నతఁ డొక్కట వైరియేని,
గురువరుండేవి దోషవిస్ఫురణ మున్నఁ
జెప్పియే తీరవలె నిది శిష్టమతము. 297

క. శూన్యతమగు నిది గన్గొని, పైనెది వ్రాసినను నంత బాగుండమి నే
మేనియు వ్రాయకయే యా, పైనొకకొన్నాళ్లు జరుపుచుట్టున నెలమిన్.

ఆ. వె. అన్నవగవుఁ గొండయం దిద్దరునుగూడఁ
గలిసికొనిరి యష్టకడుఁ గఠినము
గాఁగ మనవిసేయఁగాఁ గల సంగతుల్
మనవిచేసి నిలఁడు మఱియు మఱియు. 298

ఆ. వె. అట్లు మనవిచేసినట్టి పిమ్మటఁ గూడఁ
బూర్ణశాంతి మదికిఁ బొడమనయ్యె
నాఁటి వ్రాఁత తను గుణంబులు మాత్రమే
తెలిపెనేని యనుమతింత్రు వారు. 299

క. అని యూహింపఁగనయ్యెడి, వినువారల కట్లు వ్రాయువిధ మెటు నచ్చున్
గొనమును దోసము న్యాయము, గను జూపి విమర్శ సలుపఁగాఁదగు నెందున్

తే. గీ. వ్రాయ నవకాశమూ లేదు, వ్రాయకున్న
మదికి నూఱటయును లేద, చదకి పదకి
మీఁద మూఁడు మాసమ్ముల కేని కొంత
ప్రస్తుతంబైనఁ గాకున్న వ్రాసి రట్లొ. 301

(1931 సం॥ జూను 25 తేదీ ఆంధ్రపత్రికలోని శాంతివ్యాసచర్చ చూడుఁడు)

ఆ. వె. విస్తరంబిఁకేల "విప్రుల యలుకయుఁ
దృణవహ్నితాళనమ్ము దీర్ఘమగునె ?"
అన్నమాట కస్మదాచార్యవర్యుండె
ప్రథమమగు నుదాహరణము తెలియ. 302

ఆ. వె. ఇట్టి గురునిపాద మెలమి సభావేదిఁ
బట్టి తొడిగఁ బరమభక్తియుక్తి
నెలమి వేంకటేశుఁ డెల్ల రామోదింప
గండపెండరమ్ము కనకమయము.

క. మనమున నలమర దీఱం, గను గండర మపుడు దొడిగెఁ గవి వెంకన; దీ
నినిగూర్చి యెల్లపత్రిక, లను మోదము నెఱపి యిట్లు లానందించెన్. 304

(అంగీరస సం॥ ఆశ్వయుజ బ 30 శనివారము కృష్ణాపత్రిక, 1932 సం॥ నవంబరు 12 తేదీ ఆంధ్రపత్రిక, అంగీరస సం॥ భారతిలోని కవిపూజ చూడుఁడు.)

తే. గీ. అంత కొక్కొంతపూర్వమం దల్ల రాజ్మ
హేంద్రపురమున వసురాట్కవీంద్రునకును
జరిగె సమ్మాన మప్పటి సభకుఁ గూడ
నరిగి వెంకన తగునుపన్యాస మిచ్చె. 305

తే. గీ. పిదప బందరు పురమునఁ బేరువెలయు
గాయకాగ్రణి పండితశ్రీయుఁ గల్గు
నల్ల హరి నాగభూషణు నెల్లవారు
గూడి మానించి రందులకుఁ జనె నితఁడు. 306

క. ఇటు పది పదేను నాళ్ళ, చ్చటఁ జూచినఁ గవులకేమి చర్చింప మహో
ద్భటులైన గాయకులకే, మటు జరిగెఁ గౌరవమ్ము లతివర్ణ్యములై. 307

తే. గీ. షష్టిపూర్తికి నాటి బీజమ్ము నాఁడు
నాఁటి కభివృద్ధి చెంది యత్నము నొనర్పఁ
బత్రికలలోన వ్రాఁతలు ప్రబలఁజొచ్చెఁ
దద్విధము కొంత యిందు నుదాహరింతు. 308

(అంగీరస సం॥ భాద్రపద శు॥ 3 శనివారము కృష్ణనుండి సంపాదకీయము)

## శ్రీ చెళ్లపిళ్ల వెంకటశాస్త్రిగారి షష్టిపూర్తిమహోత్సవము

బ్రహ్మశ్రీ చెళ్లపిళ్ల వెంకటశాస్త్రిగారికి షష్టిపూర్తిమహోత్సవమును జరిపి బందరు పౌరులు శ్రీవారికిఁ జిరకాలముగఁ బడియున్న విద్యాఋణమును దీర్చుకొనవలయునను సంకల్ప ముదయించినది. శ్రీ వెంకటశాస్త్రిగారొక బందరునకే గాదు. ఒక విధముగ జూచినచో నాంధ్రదేశ మంతటికినిగూడ కవితాగురువులు. శాస్త్రిగారొక యభినవకవితాసంప్రదాయమునకుఁ గూటస్థులు. శ్రీమూరురాయరగండ కృష్ణదేవరాయలవారి యాస్థానమున కవితాసతి యష్టదిగ్గజములపైఁ బరిఢవిల్లిననాటినుండి యీనాఁటివఱకును గవితాసతి కింత మహాప్రతిభ గడించిపెట్టినది తిరుపతివేంకటేశ్వరులుదక్క మఱియొకరు కానరారు. దైవదుర్విపాకముచే నాపుమాకార సరస్వతీయుగములో నేఁడు మన కొక్కరే మిగిలినారు ఆంధ్రకవితాప్రియులు వారి నొక్కరినైనఁ బూజించి ధన్యులయ్యెదరుగాక.

"అభినవరామలింగబిరుదాంకుఁడ నాకవనమ్మనేఁను నీ । యధఃణపుగాంధ్రము తప్పలిడ నర్హ్మాలె"

ఇత్యాదిగా గర్జిల్లిన యీకవిసింహము నేఁడు వార్ధకమునఁ జిక్కియు పూర్వతపఃఫలతేజస్స్ఫారముచేఁ జేవచెడకయున్నది. వ్రాయవలసినచ్చినచో శ్రీశాస్త్రులుగారి కవితావిశేషములనుగూర్చి మఱియొక భారత మగును. కాని యిది సమయము గాదు, స్థలమును లేదు. కవితాభిషేచనముగనక యింత బీడువారియున్న కేదారభూములలో నీమహాకవిమేఘము కాళీపాదమంజీరనాదా దేశంబున గర్జిల్లుచు నమృత వర్ష ధారలు గురిపించి సారస్వతజననీశరీరమును నిలువెల్లఁ బులకితమొనర్చి నవ్యకవిజనాంకురముల నపారముగ వర్ధిల్లఁజేసి నేఁటికి పూవులతో పిందెలతో కాయలతో తనరారున ట్లొనర్చినది. నేఁ డీనవాంకురము లన్నియుఁ బెరిగి పుష్కలావర్తసన్నిభమైన యీ కూటస్థమేఘమూర్తికి పుష్పాంజలు లీయవలదా! శాస్త్రులవారి షష్టిపూర్తిమహోత్సవము నాఁటికి వారి కావ్యనాటకము లన్నిటిని సంపూర్ణసంపుటములుగా నచ్చొత్తించి శ్రీవారికి పాదపూజగా సమర్పించుటకు సంకల్పించిరి. ఇది సామాన్యముగ షష్టిపూర్తి జరిగినవారి కెల్ల నిదివఱకు చేసిన సన్మానమే. శాస్త్రులుగారి విషయమున విశేషమేమైనఁ జేయఁదగునేమో శిష్యలోక మూహింతురుగాక. ఇట్టి షష్టిపూర్తిమహోత్సవములలో ప్రాచీనసంప్రదాయము నెఱిఁగి ప్రవర్తింతురుగాక —

—:ఆంగీరస సం॥ కార్తిక శు ౮ శనివారము నాఁటి కృష్ణనుండి షష్టిపూర్తి:—

బ్ర॥ శ్రీ చెళ్లపిళ్ల వెంకటశాస్త్రి గారు — ఆధునికాంధ్రకవిపుంగవులలో శ్రీ తిరుపతివేంకటకవు లగ్రస్థానమున కర్హులను విషయము నిర్వివాదాంశము. దురదృష్టవశమున నీజంటకవుల నిరువుర నొకటిగా గౌరవింపగలిగిన అదృష్టమాంధ్రులకు కలిగినది కాదు...... ఈ మహాకార్యమునకై పూనుకొనిన బందరుపౌరుల కాంధ్రు లెల్లరును తోడ్పడఁగలరు. ఈ సన్మానసభవారి యుద్దేశము లెవ్వియో ముందుగా పత్రికాముఖమున తగుశడవొసంగి ప్రకటింపఁగలుగుచో వివిధప్రాంతముల వారును వారి వారి శక్త్యనుసారము తోడ్పడుట కవకాశముండఁగలదు. ఇందు నా దొక మనవి కూడఁ గలదు. ఇవ్వఁగలిగిన బిరుదు లన్నిటిని ఈపటికే తగువారి కిచ్చివైచిరి. ఇప్పు డట్టి బిరుదములనే వీరికిఁగూడ తగిల్చి గౌరవింపఁజూచుట బిరుదముల నిచ్చువారికిని పొందువారికిని గూడ

విలువ యుండఁజాలదు. మీ రేదేని తగు రీతిని నూతనశక్తి నవలంబించుట
కర్తవ్యము. ఆంధ్రలోకమున వీరి శిష్యులు, వీరిపై నభిమానముచే వీరి శిష్యుల
మని చెప్పికొనువారును వేనవేలు వివిధప్రాంతములఁ గలరు. వీరందఱును
తప్పక ఈ మహాకార్యమునకు తోడ్పడఁగలరు ఈ ప్రాంతములఁ గూడ
పెక్కురు విద్యాభిమాను లుత్సాహమును జూపుచున్నారు.........ఇట్టి వాటి
కన్నిటికిని తగువ్యవధి యుంచి యేర్పాట్లు గావించిన బాగుండునని కమిటీవారికి
నేఁ జేయు మనవి.

పిశుపాటి వెంకటరమణయ్య,
హైదరాబాదు. (అని యున్నది.)

(అంగీరస సం॥ మాఘమాస సంచిక భారతినుండి)

బ్రహ్మశ్రీ శతావధాని చెళ్లపిళ్ల వెంకటశాస్త్రి గారి
—: షష్టిపూర్తి మహోత్సవము :—

పందొమ్మిదవశతాబ్ది చివరపాదమున జీర్ణప్రాయముగా నుండిన యాంధ్ర
కవితాసామ్రాజ్యము నుద్ధరించి దేశమునం దంతటను విజయపతాకములను నెల
కొల్పిన పండితకవిసార్వభౌములు శతావధానులు శ్రీ తిరుపతివేంకటకవులు.
వీరిసరసశిల్పనైపుణిచే కవితాలతాంగి నవ్యాలంకారభూషితయు నూతనోత్సాహ
భరితయు నై క్రొత్తపోకడలతో సహృదయహృదయరంగముల కెక్కి నర్తనము
చేయఁదొడఁగినది, ఆంధ్రదేశమున పలువు రీమహామహులకు పరివస్య సలిపి
తదనుగ్రహమున కవులు పండితులు నై పేరునకెక్కిరి. నేఁ డీనాఁట శ్రీ శతావ
ధానుల శిష్యులు, ప్రశిష్యులు, నసంఖ్యాకులు గలరు. ఇట్లాంధ్రవాణికి పుష్టిని
గూర్చి, యాంధ్రులకు సాహిత్యకవిత్వసంపదల ననుగ్రహించి శకపురుషులన
మించిన శ్రీ తిరుపతివేంకటకవుల పవిత్రనామములు ఆంధ్రుల కెల్లరకును నిరం
తరస్మరణమననయోగ్యములు ...ప్రకృతము బందరు పౌరులు శ్రీ వేంకటశాస్త్రి
గారికి షష్టిపూర్తి మహోత్సవము సంకల్పించియుండుట హర్షింపఁదగినది.
సకలాంధ్రప్రపంచము నీయెడ తత్సంకల్పమునకు దోహదమునుగూర్చి దానిని
సర్వలక్షణసంపన్నముగా నిర్వహించి కృతకృత్యతను గాంచవలసియున్నది.
ఈ మహోత్సవముతోపాటు ఆంధ్రవిశ్వవిద్యాలయములో శ్రీ వేంకటశాస్త్రి
గారి పేర నొక పతకమును నెలకొల్పుటకును, వారి గ్రంథములను సంపుట

ములుగా బ్రకటించుటకును, గొందఱి సూచనలు [illegible] ఈ సూచనలన్నియు సామా
న్యమును జెప్పఁ బనియుండదు శతావధానులు [illegible] రచించిన మహాప్ర
కృతికిని తమకు వారియందు గల యసమానగురుభక్తికిని అర్హ[illegible]
చిహ్నము నీరీతి నెలకొల్పుట సముచితము ధర్మము, కాని ఈ షష్టిపూర్తిమహో
త్సవము దక్కఁ దక్కిన యే స్మృతిచిహ్నమైనను తిరుపతివేంకటకవు లిరువుర
పేరను వెలయవలయుఁ గాని యొకరి పేర మాత్రము వెలయుట సముచితము
గాఁజాలదు. తిరుపతివేంకటకవుల యవినాభావ మాంధ్రవిద్వల్లోకము గుర్తింప
నిది కాదు. "భాషోచ్ఛిష్టం జగత్సర్వమ్" అన్న రీతిని ఆంధ్రలోక
మంతయు తిరుపతివేంకటకవిద్వయోచ్ఛిష్ట మనఁదగును శిష్యులును ప్రశిష్యు
లును తత్పరంపరలోని వారును అనువారు నేఁ డాంధ్రలోకమున వందలాదిగాఁ
గలరు. వారిలో పలువురు శ్రీమంతులును శతావధానులవలన సాహిత్యకవిత్వ
సంపదలను గొల్లఁగొనినవారు. వీరలను వారి పేర నొక పతకమును నెలకొల్పుట
పుస్తకముల నచ్చొత్తించి యిచ్చుట యనునది అల్పమాత్రాభ్యర్హణము కాఁ
గలదు. మీఁదుమిక్కిలి ఉభయుల తాహతునకును చాలునది కాఁజాలదు.
కనీస మేఁటేఁట, రెండు విద్యార్థివేతనములైనను నెలకొల్పుట సముచితము.
ఇది యిరువురు విద్యార్థులకు. ఒకటి ఉభయభాషాప్రవీణునకు, మఱియొకటి
తెలుఁగు బీ. ఏ. కు సంస్కృతసాహిత్యకవిత్వతత్త్వపరిశీలనమునకై యుద్దేశింపఁ
బడవలయును, దీని నేఁటేఁట, నియమపు విద్యార్థులను సాహిత్యకవిత్వతత్త్వ
పరిశీలనమున తయారుచేయుట సమకూరును. ఆంధ్రవాఙ్మయమును మఱింత
యభివృద్ధిని గాంచుట కవకాశము లేర్పడఁగలవు. తిరుపతివేంకటకవిశతావధాని
ద్వయము నామమును దేశము, వాఙ్మయము నున్నంతకాలము నిలిచియుండఁ
గలదు; ఇట్టిది శతావధానులు వాఙ్మయమున కొసరించిన సేవకు తగిన ఫలము.
ఇట్టిది తచ్ఛిష్యప్రశిష్యపరంపర కావింపఁదగిన గురుపూజనము."

---

తే. గీ. ఎంత తగ్గించి కైకొని యిందుదాహ
రించినను నిప్పటికి విస్తరించెఁ గాన
నాంధ్రపత్రిక లోనగునవి యుదాహ
రింపలేదని యెఱుఁగను దెలుఁగవలయు. 309

ఉ. ఇది యిటులుండ నెయ్యదియొ యొక్కఁడు లాభము కల్గునంచుఁ దా
మొదలనుకొన్న దే యుదకు ముప్పున కియ్యది హేతువౌ నటం

చెడ భయమందఁదగ్గదయి యెట్లో భవానికృపన్ లవంబు నా
పద గలిగింపకే సురిఁగెఁ బై శనిలో బుధుఁ డేగుదెంచుడున్. 310

ఆంగీరస సం॥ పుష్య బ॥ ౨౧ మె॥ శ్రీముఖ సం॥ జ్యేష్ఠ బ॥ ౦ వ॥
శనన్యంతరములో బుధవిదశ

మ. ఒగిఁ దా నీబుధుఁ డేగుదెంచుటయుఁ గానూరగ్రహారంబు చే
ర్మిగ శిష్యుం డొకరుండు "పుత్రునకు నెమ్మిన్ బారసా" లంచు నొ
ప్పుగ వెంకన్నను వెంటఁబెట్టికొని సమ్మోదమ్ముమై నేగ నూ
రఁ గలారెల్ల బహుప్రహర్ష మలరారన్ సత్సభాసీనులై. 311

తే. గీ. ఇతనిఁ గోరంగ వారల కెల్లఁగలను
హర్షముప్పొంగ నొక యుపన్యాస మొసఁగి
యందుఁ బెద్దల యాశీస్సు, లట్లు పిన్న
లైనవారి నమస్కృతు లంది పిదప. 312

తే. గీ. శిష్యుఁ డొసఁగు బహూకృతి చేకొని కడి
యమున కేతెంచు మార్గమ్మునందు నిడద
వోల్పురిని రామమూర్తి ననల్పవైద్యు
బొమ్మగంటికులుని గాంచి సమ్మదమున. 313

తే. గీ. అతఁ డొసఁగినట్టి మధురసాయనము స్వీక
రించి సుఖముగ నింటి కేతెంచుపిదప
రామచంద్రపురము సభాగ్యముగ నేగ
వలసెఁ "బ్రసిడెంటు" గూర్చి యుపన్యసింప. 314

క. కాకర్లపూడివంశజు, శ్రీకరగోపాలరాజుఁ జెన్నొందఁ గవి
త్వాకలితుఁ జేసి పౌరుల, దౌ కోరిక మెఱుచటి దిన మం దెసకమునన్.

క. పేటోక్త యుపన్యాస ము, దారగతి నొసంగి యచటి తజ్ఞు లిడు నమ
స్కారములకుఁ బాత్రుండై, చేరెన్ గడియమ్మ సుఖము చెన్నలరారన్

క. మంత్రిప్రగ్గడవంశ్యుఁ డ, నంతాపరిపాలనమ్మునం దధికృతుఁడౌ
మంతిరుల నొక్కరుఁడు శ్రీ, మంతుఁడు నరసింహుఁ డెలమి మైఁ బిలువంగన్

తే. గీ. రాజరాజనరేంద్రుపురమునన్నైన
యతని కొమరునివాహార్థ మరిగి యచటి

సభలు దిలకించి తా నొక సభ నుపన్య
సించి సత్కృతిగాంచి విచ్చేసె గృహము. 338

ఆ. వె. అగ్రసరము నుండి యరుదెంచి యొక రాజు
తన కుమారు పెండ్లి తఱియుఁ గాన
రాకతప్పదని భరముమెయిఁ గోరంగ
మాట తీయరామి మంచి దనియె. 319

ఆ. వె. జీడిగుంటనుండి చెచ్చెర వెలమాగే
స్త్రాకరుఁ డేగుదెంచి ప్రకటభక్తిఁ
గొమరుపెండ్లిగానఁ దమరు రావలెనని
కోరెఁ గోరుటయును గొంకు మిగుల. 320

క. "మీ రతిభక్తిం గోరితి, రారోగ్యము తక్కువౌట నరుదెంతునో, లే
దో; రహి యత్నించెద మన, యారంభము నెగ్గ దైవ మది తోడ్పడినన్."

వ. అని సందియమ్ముగాఁ బలుకుటయు

తే. గీ. అర్ధవరపురాజన్యున కట్లె జీడి
గుంట వెలమాగేస్త్రాకరు నన్నుసఖుఁ డౌటఁ
బాదముకులుండు బుద్ధ్యయు పట్టుపట్టి
రాకతీరద టనియె మర్యాద మిగుల. 322

ఆ. వె. అంతె కాక తనదు సమగుఁ దమ్ముండు శ్రీ
రాము నంపి తుదకు రమణ రెండు
పెండిలులకుఁ గూడఁ జేర్మిమైఁ బయనంబు
సాగఁజేసె నచట సభ్యు లలర. 323

క. ఆ రెండు గ్రామములఁ బెం, పార సభలు చేసి వారి యత్యాదృతి స
త్కారములం గైకొని యిలు, సేరెన్ వెంకవరయ సుతులు శిష్యులు గొలువన్.

క. ఈ పెండిలులకుఁ బూర్వమ, యీపొత్తము కృతినిగొనెడి నృపసత్కృతియున్
బ్రాపించెఁ దత్ప్రసంగ, వ్యాపృతి కృత్యాదియంద వర్ణింపఁబడెన్. 325

క. కాన నిట విస్తరింపక, మానితి నటఁ జూచికొన సమస్తము దెలియున్
శ్రీనెగడ నింటి కేగిన, యానాఁడే పయనమబ్బె నది యెట్లన్నన్. 326

క. శ్రీ లక్ష్మీనరసాపుర, పాలుఁడు ప్రద్యుమ్నభూమిపాలుఁడు పట్టం
బోలిం గట్టికొనుచుఁ గవి, తాలోలుం డగుట వార్త దా నంపె వెసన్.

ఆ. వె. అటకు వేంకటగిరి యాదిగాఁ గలుగు భూ
పతులు పెక్కుమంది వచ్చి చెలమి
జరిగె నుత్సవంబు శాస్త్రోక్తరీతిగాఁ,
నచట నుండెఁ గొన్ని యహము లితఁడు 328

క. నూతాఉలు సేలువు లిడి, యారాజన్యుండు పంప హర్ష మెసఁగ ను
శ్రీ రంజిలఁ గొమరులతోఁ, జేరెన్ గడియమ్మఁ గవియు శిష్యగణముతో.

తే. గీ. బుధవిదశ వచ్చుటాది యీకథను మున్న
వ్రాసియుంచినదాని సవరణయుఁ దరు
వాయి వ్రాయుట పీఠిక వ్రాయుటయును
జరిగెఁ దత్త్వంబు దైవజ్ఞు లరయఁగలరు. 330

తే. గీ. రాహుదశలోన రాహ్వంతరమ్ములోన
బుధవిదశయందు దీనిని మొదలుపెట్టి
ముప్పదారేండ్ల కథను సంపూర్తిగ లిఖి
యించి యిన్నాళ్లవఱ కట్టెయుంచి దీని. 331

క. శనిదశలో శన్యంతర, మునఁ గూడన్ బుధవిదశనె పునరారంభం
బొనరించుట,యొగివ్రాయుట యనుఘటియించుటకు హేతువూహింపవలెన్.

ఆ. వె. 'సాఫు' వ్రాసి కడమ సంపూర్తిఁజేసి పై
నెప్పు డేది జరుగు నప్పు డదియె
వ్రాయ వీలటంచుఁ బలుసారు లనుకొంటె
కాని పట్టలేద కలము నెపుడు. 333

క. ఓపిక లేకయొ శ్రద్ధా, లోపమొ స్వకృతి యిది యాటలోకముతో పా
టీపురుషునకు ననాస్థయొ, యాపాదింపుటయొ యుక్తమగు నటులైనన్.

తే. గీ. వేఱు కారణ ముండియేతీరవలయు
బుధునియం దిట్టి సందర్భమునకుఁ గొన్ని
కారకత్వాదు లూహింపఁగనగుఁ గాని
యవియుఁ గన్పట్టు శుక్రగ్రహమునఁ గూడ. 335

క. ఇఁక నొకటి శుక్రుఁ డెంతయుఁ, బ్రకటించుఁగాని కవిత, వైరంభాదవిం
పకమానుఁడు తుదకు జయం, బు కలుగునట్లును ఘటించుఁబోరిఁబోరి నెందుఁగా.

క. ఆ యీ మాహాత్మ్యాంశంబుల, నే యయ్యలో కాని యెల్ల దెలుఁగరు తాన్న
గ్ధీయుతులగు దైవజ్ఞుల, కై యీ సందియము గని యుదాహృతము లిటులన్. 337

క. పలువురు శిష్యులుఁ గొమరులు, సలలితముగఁ [illegible]ములను జముపఁగ శ్రీపు
ల్లలితాంబయును నారోగ్యం, బెలమిన్ గరుణింప వేంకటేశ్వరుఁ డిట్టుల్.

క. కాలక్షేప మొనర్చుచు, సోలఁ దెలుఁగుఁ బరిషదమున కేగి యచట స
శ్శ్లోకులు రిడు నుపన్యాసము, లాలించె స్వయముగ మాటలాడెం బిదపన్. 339

తే. గీ. అందు ముఖ్యాంశ మియ్యది యల్ల ప్రాస
పాటి దేవేంద్రు నిప్పటి పలువురు కవు
లలఁతిగా బొబ్బిలినిబట్టి యాడు టదియుఁ
గూడ దను వాదు సభలోనఁ గొంత జరిగె. 340

చ. అది కవులందు లేదనియు నమ్మహనీయుచరిత్రమందు యు
న్నదనియుఁ జెప్పి బొబ్బిలికి నాయన మాత్రము కాక 'ఘ్రింది బూ
సి' దొరను బై నిజాంప్రభుని సేనను దోడుగఁ గొంచుఁ బోవుటే
విదితముచేసె నానృపుఁడు భీరుపటం చితఁ డాడె నేర్పులన్. 341

తే. గీ. అపలఁ గొన్ని దినములకు నన్నపరపు
దేవుకళ్యాణమహ మరుదెంచె; నచటి
కరిగి మునుపోలెఁ గొన్నినా ళ్లచట నుండి
యింటి కరుదెంచె నూతారు లెలమిఁ గొనుచు. 342

క. ఆరోగ్యలోప మొండొక, తీరునఁ బొడసూప దానిదెస లక్ష్యము లే
[illegible] రహిఁ గాలక్షేపం, బారంగ నొనర్చుచున్న యావసరమందున్. 343

తే. గీ. కీర్తిశేషుండు శిష్యుండు కేవల సుగు
ణాఢ్యుని సుకవి పద్మనాభాఁటికులుఁడు
నైన నరసింహశర్మ జ్యేష్ఠాత్మజాత
పెండిలికి నేగుదెంచెను బిలుపు పేర్మి. 344

చ. పలువురు శిష్యు లుండినను బందరు పట్టణమందు వీనికిం
దుల యొకరుండు గామిఁ దటితో నల శిష్యుని కూఁతు మేల్మి పెం

డిలి కోగి బంద శేగి కడు నెమ్మి దలిర్పఁగఁ బెండ్లిపూఁతుఁ బెం
డిలి కొమరుల్ గడుంగడుఁ గడిందిగ దీవనలన్ బొనర్చియున్. 345

క. హరి నాగభూషణుం డటె, మఱి మార్గంగికుఁడు రామమూర్తియు రసమున్
గుఱియ నొనర్చిన సభ న, య్యిరువుర నాశీర్వదించి యెలమి మిగులఁగన్.

ఆ. వె. పెండ్లివారు మఱియుఁ బెఱశిష్యులు నొనర్చు
సత్కృతుల గ్రహించి సంతసమున
నింటి కరుగుదెంచె నీ బుధవిదశను
భూమి కొంత కొనుట పొసఁగె నెలమి. 347

శ్రీముఖ సం॥ జ్యేష్ఠ బ ౮ మొ॥ శ్రావణ బ ౧౨ వ॥ శనిలో

—: శన్యంతరములో కేతువిదశ :—

ఆ. వె. అంతఁ గేతువిదశ యారంభమయ్యె వీఁ
డరుగుదెంచినట్టి యల్పకాల
మునకె గేహమందు మొనసె జ్వరపు బాధ
వెంబడిగ నరోగవిభవ మొదవె. 348

తే. గీ. హాని వాటింపకున్నను నప్పుడప్పు
డింటిలోనేమి వంటిలోనేమి వీఁడు
కొంత యస్వస్థకుఁ గాకుఁడుగ నుండి
వెడలుచు శుభాప్తి సూచింపఁదొడఁగెఁ గడఁక. 349

శ్రీముఖ సం॥ శ్రావణ బ ౧౨ మొ॥ మాఘ బ ౧౨ వ॥

—: శనిలో శన్యంతరములో శుక్రవిదశ :—

తే. గీ. ఇంటిలో కన్న వంటిలో నీతఁ డెక్కు
డుగను గల్పించెఁ బీడ యట్లు గలిగించి
యును జనుచుఁ జాలభాగ మత్తనువుపీడ
కిచ్చెను బ్రశాంతి భృగువు పై నేగుదెంచి. 350

క. ఇతఁ డరుదెంచినదాదిగ, సతమై యారోగ్య మెసఁగె సకలమ్ము గుదు
స్థితియుఁ గ్రమక్రమముగ నడ,లి తనూబల మొదవె ధనపు లేమియుఁ దొలఁగెన్.

తనకు నితరు లీవలసిన, ధనము 'వసూ' లగుటె కా కుదారుండును శ్రీ
ఖనియు నగు బొబ్బిలి విభుం, డని పెం బ్రీతివ్రత మొనర్చినట్టి ధనమ్ముల్.

తే. గీ. ఇతఁడు పట్టాభిషేకంబు కృతిని గొని యు
సంగ వేయు నూటాఱులు సత్కృతిగను
మఱియు నేఁడేఁట నూఱార్లు దర్శనమున
గురుగకున్న నొసఁగునట్టు లానతిచ్చె. 353

ఆ. వె. ఆనతిచ్చెఁ గాని యావార్షికము పంపఁ
డయ్యె వత్సరద్వయమ్ము నాలు
గెలలు జరుగు మీఁద నేని వేంకటకవి
మదిని దలఁచుచుండె మఱచె ననుచు. 354

ఆ. వె. అట్టితఱిని బంపె నావిపన్నపురరాష్ట్ర
మంత్రి యైన నృపతిమానసమున
నెంత జ్ఞప్తి కవులయెడ నున్నదో చదు
వరు తెలియంగ నిందు వ్రాసినాఁడ. 355

ఆ. వె. అట్లు శుక్రవిదశ యారంభమై షష్టి
పూర్తి తెగుపాటి యార్తిశాంతి
నిడఁగ బంధ రీతఁ జేగ సతీసుతుల్
బంధుశిష్యగణము బలిసి కొలువ. 356

క. జరిగె నట షష్టిపూర్తి వి, వరముగ నది యిచట వ్రాసినచో వి
స్తరమగును గానఁ బత్రిక, లరయుటకై చదువరులను బ్రార్థింతుఁ గడున్.

తే. గీ. అందుఁ గొన్నిటిలోఁ గొన్ని యంశములను
వ్రాయుచున్నాఁడ నిటు, లిట వ్రాయకున్నఁ
బత్రికల పేళ్లు మన చదువరుల కెట్లు
తెలియనయ్యెడినని మదిఁ దలఁచి తలఁచి. 358

క. కడుఁ బెద్దయుపన్యాసము, లిడి రలవారలకు నతుల నిడుచున్ మఱి నా
యెడ గురుత నెఱపువారల, కిడుదున్ దీవనలు సర్వకృతిసమ్మతిగన్. 359

(శ్రీముఖ సం॥ ఆశ్వయుజమాసపు భారతినుండి)

ధన్యవాదము.

ధన్యమైనది, ఆంధ్రదేశము ధన్యమైనది, జీర్ణప్రాయముగనుండిన యాంధ్రకవితాసామ్రాజ్యము నుద్ధరించి దేశమునందు నలుకెలంకుల విజయపతాకలను-

ప్రతిష్ఠించి, యాంధ్రకవితకు శకపురుషులన మించిన నిక్కపు కవిసార్వభౌమునకు సంకల్పించిన షష్టిపూర్తి మహోత్సవాభ్యర్హణను సర్వలక్షణసంపన్నముగ మహావైభవముతో నిర్వహించి సకలాంధ్రప్రపంచము కృతకృత్యమైనది. శతావధాను లొనరించిన మహోపకృతికిని, వారియందుఁ గల అనూనగురుభక్తికిని, ఆంధ్రుల యీయాభ్యర్హణ అర్హమై చెలసినది, ఆంధ్రప్రపంచ మీ తెలుఁగున తన కర్తవ్యమును నిర్వహించి ధన్యతగన్నందుకు విశ్వభారతి సంతసించినది, కామితప్రదాయిని దేవి కామేశ్వరి ఈ మహనీయునకు, ఇతోధికాయురారోగ్యముల నొసంగి, తెలుఁగు కవితకు మఱింత సొంపు పెంపుల నొసంగునట్లు, అనుగ్రహించుఁగాత మని యాశంసనము. ఈ షష్టిపూర్తి మహోత్సవముతో పాటుగనే శ్రీ వేంకటశాస్త్రిగారి - కాదు కాదు తిరుపతివేంకటకవుల, మా యానేత్రములకు వీరొక్కరే సాక్షాత్కరించుచున్నారు, శాశ్వతస్మృతిచిహ్నముగ వీరి రచనలనన్నింటిని సంపుటములుగ ప్రచురించుటకును ఆంధ్రవిశ్వకళాపరిషత్తున బహుమతిపతకము నేర్పాటు చేయుటకును నిర్ణయింపబడినది. ఇవి రెండును, అచిరకాలములోనే వారి శిష్యులు ప్రశిష్యులు, తత్పరంపరలోనివారు, అభిమానులు ఈవఱకు రాని వారు నున్న - అందఱి యాదరమున రూపుగొని తిరుపతివేంకటకవుల శాశ్వతస్మృతిచిహ్నమై వెలయఁగలదు, ఆంధ్రభారతికి ఈడుగాని సేవ సల్పి శాస్త్రిగారు ధన్యులైనారు. అట్టిమహనీయునకు ఉడుతభక్తిగ పూజగావించి తెలుఁగు మాగాణమును ధన్యమైనది.

---

శ్రీముఖ సం॥ ఆశ్వయుజమాసపు అభినవసరస్వతి నుండి షష్టిపూర్తిమహోత్సవము

ఈ యుత్సవము బ్ర॥ వెంకటశాస్త్రిగారి శిష్యులగు పింగళి లక్ష్మీకాంతము మున్నగు బుద్ధిమంతులచే రెండుదినము లొక వివాహమహోత్సవమువలె నాచరితము. శాస్త్రులుగారు పుత్రపుత్రికాకళత్రసహితులయియేగాక యల్లుండ్రతోడను గోడండ్రతోడను వారి జననీజనకులతోడను స్వబం[illegible]తోడను వివాహమునకుఁ బోలెఁ దరలివచ్చిరి. తత్కుటుంబమునంతయు [illegible]టారు కారుపై నధిరోహింపఁజేసి ప్రథమము బందరుపట్టణము నంతయు నూరేగించిరి అనంతర మక్కుటుంబ మభినవాంబరభూషణాలంకృతిపురస్సరంబుగా వాసీనంబై యనేకశతవైదికబ్రాహ్మణవర్యుల మహదాశీర్వచనమునకుఁ బాత్రు

మయ్యెను. ఆ బ్రాహ్మణులకు యత్కించిత్సంభావనము సల్పఁబడియె. ఉత్సవ
ద్రష్టల కుచితాతిథ్య మొసంగఁబడియె. ఈయది శాస్త్రీయమైన షష్టిపూర్తి
గాకున్నను కవితాలోలురగు నవనాగరికులకే గాక విద్వత్కవులకును వేడుక
కలిగించెననుట కతిశయోక్తి గాదు. ......... యుపకవులు పెక్కండ్రు
తదుత్సవసందర్భమునఁ దమపద్యములను సభఁ బఠించి యుత్సవకర్తలకు సమ
ర్పించిరి. సభావకాశము లభింపకపోయినను నుతికొందరు తమపద్యంబుల
తత్సభవారి కిచ్చివేసిరి. నేనును గొన్నిపద్యముల వ్రాసితిని, వాటి నీదిగువ
తిలకింతురు గాక.

శా. విద్వత్కావ్యసుధానిసత్కవికగుల్, వేయింటికిన్ మించి శ్రీ
మద్వాగంబున నిద్ధమైరనుట సామాన్యోక్తి; వేయేల! భూ
భృద్వర్యుండగు భోగరాగున మిముల్ వీక్షింపు మాత్రింగవి
తోద్వేగంబు బడి కెట్లు గాదె సుకవీ! యో వేంకటేశ ప్రభూ!

సీ. త్వద్గ్రంథములనైన నిను సత్ప్రోత్సాహములనిచ్చి బుధజనుల్ ముదితులైరి.
బాలసరస్వతీ ప్రభృతి శిష్యబృందాళి గనిసి సత్ప్రభుల్ దాసులైరి
గండపెండేరమున్ గాలికిన్ దొడిగి యీబంధుగు జనులు సానందులైరి
షష్టిపూర్తిమహోత్సవంబు సాగించి ప్రస్తుతింబందఁగలుగఁ గృతార్థులైరి

ఆ. వె. అడిగినాఁడ మీరు యత్నించినాఁడ స
మాశ్రయించినాఁడ యందుకొఁకను
తావకీనకవితాచంద్రికాతృప్త
మైన జనమె హేతు వంతటికిని.

(శ్రీముఖ సం॥ ఆశ్వయుజ బ॥ ౮ శనివారము కృష్ణాపత్రికలోని
గిడుగు వెంకటరామమూర్తి పంతులుగారి వ్యాసమునుండి)

"శ్రీ తిరుపతి వేంకటేశ్వరుల ప్రశంస"

శ్రీవెంకటశాస్త్రిగారి షష్టిపూర్తిమహోత్సవ సందర్భమునఁ ప్రకటిం
చుటకుఁగా నలుగురితో పాటు ఒకటిరెండుమాటలు వ్రాసి పంపుటకు సాహసిం
చినాను. శ్రీశాస్త్రిగారియెడల నాకుఁ గల గౌరవమునకు సూచకముగా
ఈలేఖ వ్రాయడమునకు అవకాశము నాకు దొరికినందుకు మిక్కిలి సంతోషి
స్తున్నాను. ధన్యుడను. నేటి తెలుగు కవులను ఎవరెన్నినా, చిటికెనవేలి

మీదికి ఎక్కేవారు మన తిరుపతివేంకటేశ్వరులే. యీ ఐకమత్యమునకు కారణము వారికావ్యములలో అందఱికీ స్పష్టముగా కనపడే గుణసంపదగాక మఱేమిటి?......... మన తిరుపతివేంకటేశ్వరులకు దేశభాష యెడల అభిమానమెండుగా ఉన్నది. వీరు కావ్యములలో గ్రామ్యము వాడరు. "కేవల గ్రామ్యపదముల నేవగించి జనులు వాడెడి పదములు సమ్మతములు" అని స్పష్టముగా తెలియజెప్పినారు.

క. కేవల సంస్కృతమర్యా, దావిదులును గేవలాంధ్రతత్పరులును గా
కేవార లుభయభాషా, కోవిదులవ్వారు దీని గురువులు జగతిన్.

అని మనతిరుపతి వెంకటేశ్వరులు ప్రకటించినారు ...... ఆయుస్సు ఆరోగ్యము ఐశ్వర్యము గలవారై మన వెంకటశాస్త్రిగారు ఆంధ్రసారస్వతాభివృద్ధి కొఱకు ఆయుశ్శేషము గడిపి ఆంధ్రులకందరికి ఆంధ్రకావ్యామృతము దొరకేటట్లు చేతురుగాత అని కోరుచున్నాను.

(శ్రీముఖ సం॥ సదర్ తేదీనాటి కృష్ణాపత్రిక నుండియే సంపాదకీయవ్యాసమునుండి.)

సరస్వతీపూజ.

మా పురమున క్రిందటి శని, ఆదివారములందు శ్రీ చెళ్లపిళ్ల వెంకటశాస్త్రిగారికి షష్టిపూర్త్యుత్సవములను వేడుక నామమిడి ఆంధ్రకవికోకిలములు కావ్యగీతికానిస్వనములతో వాగ్దేవి నారాధించినవి. షష్టిపూర్త్యుత్సవ మనునది కేవలము నాకబలివంటి తంతుకాదు. అఱువదిమూఁడు వత్సరములు దాఁటిన యీ కవిసార్వభౌమునకు షష్టిపూర్త్యుత్సవము జరుపుట కొందఱికి వింతగఁ దోఁచవచ్చును! వేంకటశాస్త్రిగారి శిష్యసమూహము ఒక భారతసైన్యము "ధైర్యప్రభామేరువై" ఆంధ్రకవితాసామ్రాజ్యమునఁ గోటము కట్టుటాది బుధకోటి నుతింపఁగ" ఏలినట్టి యీ కవిసమ్రాట్టును, ఆయురారోగ్యముల నిచ్చి శతాధికషష్టి వర్షములు కాపాడుమని ఆదిశక్తి నారాధింపకుందురా! తిరుపతి లేనిది వేంకటేశ్వరుఁడు లేఁడు, వేంకటేశ్వరుండు లేనిది తిరుపతి లేడుగదా? తిరుపతిశాస్త్రి లేని కొఱంతకై సభికుల మనస్సు కొట్టుకొనినది! తిరుపతిశాస్త్రిగారి కుమారులు పితృదత్తమైన కవితామాధుర్యముతో "వేంకటేశ్వరు రూపమ్మున మున్న తండ్రికి నమోవాకమ్ము" లర్పించుచు కరములు ముకుళించి అశ్రువులతో ఆరాధించినంతనే తిరుపతిశాస్త్రిగారు వేదికపై ప్రత్యక్షమైనట్లయ్యెను. వెంక

టశాస్త్రిగారు తిరుపతిశాస్త్రిగారికి కవితాగురునట! శిష్యకోటి యెన్న వెంకటశాస్త్రిగారి కర్పించిన ముత్యాల సరమునందు తిరుపతిశాస్త్రిగారు శిష్య స్వరూపమున వెనుక సమర్పించిన యీ మౌక్తికము నాయక మణియై వెలుంగుc గాక ?

మ. వితతాత్మీయశతావధానకవితావిద్యాపయోరాశిసం
భృతశిష్యాంబుదవాక్ప్రయామృతరసప్రీతాఖిలాంధ్రక్ష్మా
ధృతగద్యప్రదసీకావతంసకృతసందిస్తోత్రమాలావిభూ
షితు నా వెంకటశాస్త్రి నేc బొగడెదన్ శిష్యస్వరూపమ్మునన్.

తిరుపతి వేంకటేశ్వరులు పొందని గౌరవము లేదు! నూతనముగ పొందc దగినదియు లేదు ?

"అనుభవించితిమి దీవ్యద్భోగములను రాజాధిరాజులకన్న నధికముగను"
"ఏనుcగు నెక్కినాము ధరణీశులు మ్రొక్కcగ నెక్కినాము"

అని చెప్పుకొనిన వెంకటశాస్త్రిగారికి నేడు ఆంధ్రలోకము నూతనముగc జేయcదగిన సత్కారము లేదు! భాషాప్రపంచమున నెక్కడc జూచినను తిరుపతి వేంకటేశ్వరుల సాక్షాత్కారము తప్పదు. వీరి కవిత్వము ప్రాచీన కవిత్వమునకు భరతవాక్యము నవీన కవిత్వమునకు నాంది. విద్యావివాదములందు వీరి వీరాధివీరత్వము అల భోజ కృష్ణరాయలనాcటి వాణీవిజయమును స్మృతికిc దెచ్చును. తిరుపతి వేంకటకవులు వారి నిశితకరవాలములను తాండవింపcజేసి ధరణీశ్వరుల యెదలలను ధారుణి నంటింపc జేసిరి. వీరి గాంగనిర్ఝరధార కవితాకన్యకు నూత్న విలాసము నొనcగూర్చినది! తిరుపతి వెంకటకవుల కవిత్వము ఆధునిక కవిత్వమునకును ప్రాచీన కవిత్వమునకును సేతువు వంటిది? ప్రాచీన కవిత్వమందలి దీప్తి గోచరించును, నవీన కవిత్వమందలి ప్రసాదము సౌలభ్యము పొడసూపును; వీరి రచనలు చిరకాలము వర్ధిల్లుననుటకు సందియము లేదు.

(సదరు తేదీ కృష్ణాపత్రికనుండియే, కొందఱు కవుల పద్యములనుండి కొన్ని మాత్రము.)

—: కుసుమాంజలి. :—

పువ్వాడ శేషగిరిరావుగారు, చోడవరపు జానకిరామయ్యగారు.

చ. తిరుపతిలేక ఆసనము తీర్చి వసింతువె షష్టిపూర్తిన్ కొ
క్కరుcడనటంచు వెల్తిగొనcగాదగదార్య! నిలింపులెల్లc దా

మరదము వట్టి నింద్రుఁడనుయాయిగ బ్రహ్మపురోగముండుగా
తిరుపతిదివ్యరూపమరు దేరెను మీదగు షష్టిపూర్తికిన్......

సీ. తీయనేరెడు గుజ్జు తిని తేన్చుకొను బాలకులకు దోయిళ్ల జెల్లఁగ నమిచి
కోరిఁ తికొమ్మచ్చు దూఁకులనాటితేజిన దుడుకుబొజ్జలఁ జెల్లు నుడుఁలు పోసి
వగరు క్రొమ్మావి పిందగమి మెక్కిన కోడిగపు గున్నలకుఁ జెల్లుకైత గఱపి
చెడుగుడు గ్రుక్కపట్టియు రాని మొఱకుటయ్యల నోళ్లఁ బాండితి వెలయఁజేసి

తే. గీ. తాలుగరఁగించి యినుములోఁ బాలు దీసి
హైందవ కళాలయమునఁ దామాంధ్రభిక్షు
యిడిన తొలినాఁటి కతలు నేఁడెన్నికొనినఁ
గలఁగనినవయ్యె స్మరణయోగ్యతను గాంచి.

దీపాల పిచ్చయ్యశాస్త్రిగారు

చ. పలికిన పల్కులెల్ల రసబంధురసుందరపద్యపంక్తులై
యలఘుతరప్రబంధములునై రసపత్త్రనాటకంబులై
నలువగు చాటువుల్ ప్రహసనంబులునై యలరార నొప్పు ధీ
లలితుని వేంకటేశ్వరు విలక్షణలక్షణు బ్రస్తుతించెదన్......

చ. గురువులఁ గొల్చి పాండితిని గొందఱుగందురు దానికేమి? మా
తిరుపతివెంకటేశకవిధీరుల పాదసరోజయుగ్మసం
స్మరణము చేతనే మధురమంజులవాక్యము లల్లనేర్చె నెం
దఱొ కవులైరి యెందుగలదా! మఱి యిట్టి మహత్త్వ మొజ్జలన్......

జంధ్యాల పాపయ్యశాస్త్రిగారు.

సీ. తలమీఁది వెండ్రుకల్ పలుచఁబడ్డవిగాని పలుకు కమ్మదనంబు పలుచఁబడదు
నడలలోఁ దడబాటు పొడసూపెనే గాని నుడులలోఁ దడబాటు నడువరాదు
శారీర పటిమంబు జాఱుచున్నదిగాని ధారణాపటిమంబు జాఱలేదు
ఒడలిపై ముడుతలు పొడముచున్నవిగాని కవితలో ముడుతలు గానఁబడవు

తే. గీ. పరఁగ నొక్కొక్క యేఁడు పైఁబడ్డ కొలఁది
నీవు వృద్ధగుచుండఁగా నీదు కవిత
యంతకంతకు వయసుపిల్లగుచు నుండెఁ
జిత్రమిది యార! సుకవితాచిత్రకార!......

# ఉత్తరార్ధము

వేమూరి సీతారామశాస్త్రిగారు.

చ. చదువుటయుండె యున్నదొ ? రసప్లుతి భావము దోఁచు దానసే
పొదలును చిత్తమాదకత మూర్తియొ, లోకవిమోహశక్తియో !
యిది యది యంచుఁ దేల్చి వచియింపఁగ నోపముగాని యెవ్వరున్
గదలఁగలేరు మా గురులు గల్గు సభాస్థలి జిత్రవైఖరిన్.

సామవేదము జానకీరామశర్మగారు.

ఉ. గ్రంథము చేతఁ బట్టి సరిగా పదినాళ్లు భవత్సకాశసం
బంధము గల్గఁజేసికొన బాపురె ! సత్కవితాలతాంగి ని
ర్బంధముఁ బెట్టి యాత్మ ననురాగముగూర్చి విడంగరాని సం
బంధము గల్గఁ జేయు నినుఁ బట్టిన శిష్యుల కెల్లఁజిత్రమా.

మల్లంపల్లి భైరవమూర్తిగారు.

ఉ. రాజుల లెక్కసేయు పతి రాజసవృత్తి జరించి దేశవి
భ్రాజితకీర్తిచంద్రికలు పర్వఁగ సర్వదిగంతరంబులన్
భూజను లిచ్చు కాన్కలను బొందుచు వారికిఁ దుష్టి గూర్చు నీ
తేజమె యాంధ్రలోకకవిధీరశరణ్యము వెంకటేశ్వరా.

వేలూరి శివరామశాస్త్రిగారు.

గీ. జయజయ షష్టిపూర్తిపరిషత్పరమేశ్వర ! వేంకటేశ్వరా !
జయజయ భారతీవదన పద్మదివాకర ! వేంకటేశ్వరా !
జయజయ భావనావిభవ సాగరశ్రీకర ! వేంకటేశ్వరా !
జయజయ పూర్వనవ్యకవిసంఘకృతాదర ! వేంకటేశ్వరా !

ఉ. మాయఁగరాని వేదనను మూఁడు శతాబ్దులనుండి మూఁగయై
పోయిన యాంధ్ర భారతిని బుట్టినతోనె వసంతమాసపున్
గోయిలఁ జేసి యెల్లెడలఁ గ్రుమ్మరఁ జేసిన మేటి చెళ్లపి
ళ్లాయఁడు వేంకటేశకవిరాజు గ్రహించుత మా నమస్కృతుల్.

ఉ. ఎక్కడఁ జూచినన్ గవులె యెక్కడఁ జూడ శతావధానులే
యెక్కడఁ జూడ నాటకపు లెక్కడఁ జూడఁ బ్రబంధకర్తలే
దిక్కరులంచుఁ బేర్పడిన తిర్పతి వెంకటసూరులేఁగు నా
ప్రక్కల నెల్ల నీకడుపు పండెఁగదమ్మ ! తెలుంగుదేశమా !

మ. నుదుటన్ కుంకుమబొట్టు పెట్టి పాదముల్ దోరంబుగాఁ బట్టి యె
త్తైదుటన్ బొల్చు మహేంద్రునిన్ గనక బ్రాహ్మీభావనాలోకపా
ర్షదులై తిర్పతి వేంకటేశు లవతారం బెత్తిరో నాఁగ బ
ల్లిదులౌ బాలకవీశశేఖరులు తల్లీ! యొందఱో చెప్పుమా.

సీ. శ్రుతివేసినారు మీ శుభగానములకెల్ల యాంధ్రులు మగనార లాఁడువారు
తలదాల్చినారు మీ పలుకులు రసికులౌ కవులెల్ల రాజాజ్ఞకన్నమిన్న
చెవులొగ్గినారు మీ కవితలోఁజవులకై మకుటంబు లల్లాడ మనుజపతులు
పచ్చకప్పురముగా భావించినారు మీ మాటలు విజ్ఞానమహితులెల్ల

తే. గీ. వచ్చియున్నారు స్వాగత మిచ్చుకొనుడు
నోలిఁ బంగ్రెండు తెలుఁగు జిల్లాలవారు
వారి యనురక్తచిత్త భండార మెల్ల
చూఱఁగొనితయ్య! వెంకట సుకవివర్య!

"పిశుపాటి వెంకటరమణయ్యగారు"

సీ. రాజనరేంద్రుడు రాట్సభాంతరముల నన్నయ్యభట్టుతో వన్నెకెక్క
తిక్కయజ్వప్రభాదీప్తి కాకరమయ్యె మనుమసిద్ధి సభాధి మంటపంబు
పెద్దనార్యుఁడు సాము గద్దె నెక్కను నాఁగఁగృష్ణరాయని సభఁగీర్తిఁ బొంచె
శ్రీనాథుఁ డొక కొంత సీమసీమలకేగి రాట్సభాంతరముల రాణకెక్క

తే. గీ. నంతియేకాని మీవలె నాంధ్రదేశ
సకలభూపాలమస్తకమకుటరత్న
పరసమర్చితపాదసౌభాగ్యగరిమ
నందఁగల్గిరె? వారెవ్వరైన మున్ను.

సీ. గద్వాలపురి కేగి కైతఁ జెప్పించితి ఛాందసప్రవర వైష్ణవులచేత
ఆత్మకూరికి నేగ నందు గోడలుఁ గూడఁ గవితకుఁ దలలూఁచఁ గలిగెనంద్ర
వనపర్తిలో 'నహి' పలుకున కొకకొంత విలువ గల్గింపఁగాఁ గలిగితీవు
గుంటూరి కారంబు కొండొక తగ్గింప నుప్పుగల్పితి వింత మెప్పుఁ బొంద

తే. గీ. శిష్యులేరేని రిత్త దేశికుల దూఱు
ఫలము నీలోకమునఁ బొందగలుగునటులు
సాటి చెప్పితివయ్య! విశాలదృష్టి
లేని యయ్యలు కినుక మీపైని బూన.

శ్రీముఖ సం॥ ఆశ్వయుజమాసభారతినుండి

వేటూరి ప్రభాకరశాస్త్రిగారు.

పూజ్యపాదులగు బ్రహ్మశ్రీ చెళ్లపిళ్ల వెంకటశాస్త్రిగారి షష్టిపూర్తి మహోత్సవము మచిలీపట్టణమున నేడు జరుగుట మహానంద విషయము.

సీ. మోహనమ్మున జగన్మోహనంబుగఁ బద్యపఠనమ్ము నిచ్చోటఁ బాడుకొలిపె
మాధ్యాహ్నికాంతేవాసి మండలమ్ముల కెల్ల వేడ్కమై నిచ్చోట విద్య నేర్పె
తేటతేటగఁ దీయఁదీయఁగా సత్కావ్యనిర్మాణ మిచ్చోట నిర్వహించె
ఉల్లాసహారాళి నోలలాడ్చి నల్లాడు జిల్లంబు నిచ్చోటఁ జేర్చిగనియె

తే. గీ. నెన్నటికి మీసరానట్టి యిట్టి యిట్టి
శాశ్వతానుబంధంబు లెసంగియుండ
నెట్టు నిబ్బరించెనో కదే! యిట్టిపురము
వీడనాడంగ మా కవివీరవరుఁడు....

ఇరువదియైదేండ్లకుఁ బూర్వము నేను వేంకటశాస్త్రిగారి దగ్గఱ చదువు కొన నరిగిన నాఁడు,

"అలపతంజలికృతంబైనభాష్యమునకే పరిఢవిల్లును మహాభాష్యపదము."
ఇత్యాదిపద్యమును మోహనరాగరసమును పద్యభావమున జీర్ణింపఁజేసి వారు చదువఁగా తన్మయత చెందితిని. రసస్ఫూర్తితోఁ దెలుఁగు పద్యములు చదువు చాతురికి నేఁ డాంధ్రదేశమున శ్రీశాస్త్రులుగారే ఆచార్యపీఠము ఆనాఁటి నుండి ప్రతివిద్యార్థియు శ్రీశాస్త్రులుగారిఁ బోలి పద్యములు చదువుటకు బ్రయత్నించువాఁడే. ఎందఱో వారి పద్యపఠనానుకరణద్వారమున నాంధ్రభాషాపండితులైరి.

ఉ. కొంతులువోని సత్కవనగుంభన మంతకు మించి బింకముఁ
జొంకము గల్గఁగాఁ జవులు పొంపిరివోఁ బఠియించు నేర్పు మా
వెంకటశాస్త్రిపండితకవిప్రభు చక్కటిఁ దక్కఁ దక్క వి
ద్యాంకుల యందు నెందుఁ గలదా? సకలాంధ్రమహామహీస్థలిఁ....

ఆనాడు బందరులో శ్రీశాస్త్రిగారి యుపన్యాస సంపర్కములేని పౌర సభలుండెడివిగావు. వారి యుపన్యాస మన్న నే శ్రోతలు సభలోఁ గ్రిక్కిఱియ నిండెడివారు. వారి యుపన్యాసమునకు ముందు సందర్భము చక్కఁగఁ జూచుకొ

నట మొదలైన జాగ్రత లక్కఱలేదు. జాగ్రత్తపడి వచ్చి చెప్పినవారి యుపన్యాసముకంటె శ్రీశాస్త్రిలవారి యుపన్యాసముననే సంగతులు చమత్కారములు హెచ్చుగనుండెడివి. పూర్వము భోజరాజుముఖదర్శనమాత్రముననే పలువురు విద్వాంసులయిరని ప్రతీతి. నేడు శ్రీశాస్త్రిలవారి ముఖదర్శనమున నది ప్రత్యక్షమైనది. స్కూలులో శ్రీశాస్త్రిలవారు పాఠములు చెప్పకుండనే తామును పాఠములు చదువకుండనే పరీక్షలలో కృతార్థులగుచుండిరి. అంతేకాదు, కవులగుచుండిరి, మన లక్ష్మీకాంతకవి ప్రభృతులట్టి స్కూలు విద్యార్థులలో నాణితేలిన జగజెట్టులే! యిది వింతగాదు శ్రీశాస్త్రిలవారిచే నెన్నఁడును చూడఁబడనివారును శ్రీశాస్త్రిలవారి నెన్నడును చూడనివారును గూడ వారి శిష్యులై యెందఱో నేఁడు సరసకవితారచనము నేర్చి సర్వాంధ్రదేశమునఁ బ్రఖ్యాతి గనుచున్నవారున్నారు. ఈ విధముగా శ్రీశాస్త్రిలవారు విద్యావంశవృక్షమును తొలుత బందరు పురముననే ఆ నాఁడంటుదొక్కిరి. అది యిప్పుడాంధ్రదేశమున సర్వత్ర బ్రబలి చెట్లు గట్టుచున్నది. శ్రీశాస్త్రిగారు నివసించి బహువర్షములు కవితామృతప్రపను సాగించిన భైరవపెర్రిన్న ప్రక్కయింటి పట్టు ధనాఢ్యుపపత్తు లనుకూలించెనేని వారిపేర విద్యాస్థానముగా వెలయించుట యుక్తమని నా యెన్నిక. సఖ్యులిది సమాలోచింతురు గాక. నా కీ సందర్భమున.........

చ. పరిణతపాండితీబల మభంగురధారణ మాధురీపరి
స్ఫురితకవిత్వముఁ గలిగి శుభ్ర యశంబు గడించుకొన్న మా
తిరుపతిశాస్త్రి సత్కవి గతించెనె యాంధ్రవచోవధూటికిన్
స్థిరతరకావ్యభూషణవిశేషపరిష్కృతి తీరిపోయెనే......

అని విచారము కొంత తొట్రుటు గల్గించినది. కాని వెంకటశాస్త్రిగారి కవితాగంగాప్రవంతిలో తిరుపతిశాస్త్రిగారి కవితా సరస్వతి యంతర్వాహిని గా నున్నది.

క. నుతకవితామృతవాహిని, నతిలోకయశశ్శరీర మగపడుచుండన్
మృతియటె తిరుపతికవికిన్, జతయగు వేంకటకవీంద్రు చాటయి యుండెన్

అని యూరడిల్లితిని. తిరుపతివేంకటకవులు ఎక్కడేని యవధానము చేసిరనఁగా నా చుట్టుపట్టుల వారనేకులు ప్రతిభాసౌధమున పదిమెట్లు

లెక్కరన్న మాటే! మెదడు కమలిపోవునో, నరముల బరువు సడలి శరీరము వకనక లాడునో యని సాధారణ బుద్ధిమంతులు సందేహించునట్లు పగలు శతావధానతంత్రము జరపి రాత్రి పదిగంటల దాక పరిపరి వినోదములఁ బ్రొద్దుపోని తరువాత నిమ్మకు నీరెత్తినటులు నిశ్చలముగా నిద్రపోయి మఱునాఁటి ప్రొద్దుట మఱల మందహాసవదనముతో, అల్పాహారమునైన నారగింపక, అవధాన శేషములు పూరింప నారంభించు నీజంటకవుల యంతఃకరణములు ప్రీతి కలసి ఒకే మనసు అయ్యెడివి. అది యొక వింత తీరు. ఆ సమయము లందు వెంకటశాస్త్రిగారు విశ్వామూర్తులు. సభ్యులు వెంటాడు భక్తులు, తిరుపతి వేంకటేశ్వరుల కవితాధార ప్రాచీన సంప్రదాయ ఘట్టములు త్రవ్వి త్రివ్వి ఊటయూరిచి చేదిచేది పాఱించినది కాదు. స్వయము ఉద్బుద్ధమైన బుగ్గధార వారు ప్రాచీన గ్రంథముల కంటె హెచ్చుగా ప్రస్తుతపరిసర పరికరములనే చదివిరి. కావుననే సంప్రదాయమాత్రపరిజ్ఞాతలు కొందఱు వారి కవితను సంప్రదాయమూనమైన దానినిగా, క్రొత్తతీరు గలదానినిగాఁ దలఁతురు. నేఁటి యువకవులు వారి కవితను నవకవితామార్గోపదేశకమునుగా నారాధింతురు.

తిరుపతి వెంకటకవులు ప్రౌఢపండితప్రభు సభలలోనేగాదు, బాలపామర జారచోరాదుల గోష్ఠులలోఁగూడ కవితాచమత్కారములను గల్పించి సత్కారములనుబడయగలరు. వెంకటశాస్త్రిగారికి లల్లాయపదములు పాడ వేడుక, కోళ్లపుంగుడ్లులు వాడ వేడుక, వారికి భాషాడంబరము గిట్టదు. అట్లే వేషాడంబరమును గిట్టదు. కనుకనే వారి కవితాకన్య జనముద్దుగా వెలసినది. సమయస్ఫూర్తి, హాస్యయుక్తి ప్రయుక్తిచమత్కారము, వెంకటశాస్త్రిగారికి ఆజానజమగు నలవాటు. ఇట్టివారు నూటేండ్లకు ముందు నడిమింటి మంగళేశ్వరశాస్త్రిగారొకరని వింటిని. బ్రహ్మశ్రీ కళాప్రపూర్ణ వేదము వెంకటరాయశాస్త్రిగారి నింకొకరిని గంటిని. వెంకటశాస్త్రిగారి చమత్కారము లనేకములు, అవి యెల్ల సేకరింపఁ దగినవి. ప్రాచీనాంధ్రకవులలో, ప్రబంధముల కంటె శాశ్వతములగు నట్లు చాటు రచనలను సాగించినవాడు శ్రీనాథుడు. ఆతని చాటురచనలు నేఁటికిని నాంధ్రరసికుల నాలుకలపై నాట్యమాడుచున్నది. వర్తమానాంధ్ర కవులలో నట్టివారు మన తిరుపతి వెంకటేశ్వర కవీశ్వరులు. పదునైదేండ్లకు పూర్వము విశాఖపట్టణమండలమున రాత్రివేళ బండిమీఁద నేనేగుచుంటిని

ప్రక్కబండిలో నొక పట్నాయకుడు "ఇంజరం బొక సాక్షి, యేనాము దా సాక్షి, పళ్లపాలెంబుదా నెల్లసాక్షి" ఇత్యాది పద్యము పాడుచు నడుమ "శంకరుఁ డాతని సాని సాక్షి" అను పట్టున నాఁగి, యొక నవ్వు నవ్వి, మఱల నారంభించి పద్యము ముగియఁ జదువుట వింటిని. తిరుపతి వెంకటకవుల చాటుధారలు మలయమారుతపుఱ్ఱుఁ బోలెను. అవి యాహ్లాద జనకములై సర్వాంధ్ర ప్రపంచము నలముకొన్నవి. లక్షల కొలది గ్రంథసంఖ్య యందుఁ గల్గు (ముప్పది రెండక్షరముల రచనమునకు గ్రంథమని పేరు) బహు గ్రంథములు రచించు కవీశ్వరులు పలువు రిప్పుడున్నారు గాని వారి పద్యములు కొన్ని యేని హాయిముగ పండితులుగాని, పామరులుగాని, పలువురు పలుమాఱులు పఠించునవిగా నున్నవా? యన్న ప్రశ్నకు సమాధానము సభ్యులారా! మీరే సమాలోచింపఁ దగుదురు.

శ్రీ వెంకటశాస్త్రిగారికి, అన్నవస్త్రములకు కొఱంత లేని స్థితి యేర్పడెను. వెంకటశాస్త్రిగారు గృహారామధనకనకవస్తువాహనసమృద్ధితోపాటు సత్సంతాన లాభమునుగూడ బడసిరి. ఆనందమయముగా జీవితయాత్రను గడుప నవుపడెను. ఆ కాలమున నట్టి యానంద సందర్భమున నే నొక జాబులో శ్రీశాస్త్రులుగారికి వ్రాసిన పద్యమిది.

సీ. గాటంపుఁ దమిఁ దోఁట నాటుకొన్నారు నిండారఁ బండెనె జహాంగిరుమావి?
అవధానములు నూడ నభ్యర్థితులు వేఁడ నేగుచుందురె? యిప్పు డేచటికేని?
సత్కవితా రహస్యము లభ్యసింపగా వచ్చుచున్నదె? శిష్యవర్గ మిప్పుడు?
భగవత్పరములైన పరమార్థ రచనముల్ క్రొత్తవి యేవేని కూర్చినారె?

తే. గీ. కలుకుఁ గుబ్బల నునుదొక్కుఁ బలుకులందు
ప్రౌఢి మీఱిన సుకవితా ఫణితులందు
పరువుగల యంటుమామిడి పండులందు
చక్క గుఱుతించు చుందురే చవులవాసి?......

భగవదనుగ్రహమున శ్రీశాస్త్రిగారి కిదివఱకే యఱువది యేండ్లు నిండినవి. శ్రీశాస్త్రిగారి కిట్లే ఇంకొక షష్టిపూర్త్యుత్సవము గూడ జరుగునట్లు భగవానుఁ డనుగ్రహించుఁగాత.

వెంకటశాస్త్రిగారు విద్వద్రాజగోష్ఠు లందు వివిధ సత్కారముల బడసిరి. విద్యావివాదములందు విజయము లందిరి, రసవత్కావ్యములఁ జెక్కుంటి రచి

యించిరి, చాలమంది శిష్యులకుఁ జదువు చెప్పిరి, సంతాన సమృద్ధిని బడసిరి. సకల సంపదల బడసిరి, సమానులలో సత్తమశ్లోకులయిరి, ధర్మార్థకామములందు పరిపూర్ణమయిన పరితృప్తి వారికి దొరకినదనియే నా విశ్వాసము ఇఁకజీవిత శేషమున వారు పరమపురుషార్థ లాభమునకై పనిగొనుట బాగుగదా! భగవత్కృప, యిట్లు పరఁగుఁగాక! ఇది నా ప్రార్థనము......

(శ్రీముఖ సం॥ ఆశ్వయుజ బ॥ ౧౦ శనివారమునాటి కృష్ణాపత్రికనుండి)

—: పుష్పవర్షము :—

బ్రహ్మశ్రీ వేంకటశాస్త్రిగారి షష్ట్యబ్దపూర్తి మహోత్సవ సందర్భమున గురిసిన పద్యకుసుమములు

దివాకర్ల వెంకటావధానిగారు.

కీ॥ శే॥ బ్రహ్మశ్రీ తిరుపతిశాస్త్రిగారి కుమారులు.

సీ. తరతరంబులనుండి దాఁచి గోదావరి కానుక పెట్టిన తేనెవాఁక
తొలి జన్మముల నాంధ్రి తెలమి బంగరుపూల సాగించుకొన్న పూజాఫలంబు
వాఙ్మయ సస్యమ్ము వర్ధిల్ల శిష్యుల కమృత మెక్కసంగిన యంబురాశి
అన్యోన్య తేజంబు లలరించుకొని దివాకరున కాలంబమై పరగిన శిఖి

తే. గీ. కుకవిమదమత్తవారణకుంభదళన
విక్రమ పటిష్ఠమై సుంత విశ్రమించు
వృద్ధ కవిసింహ మియ్యది వేళయయ్యె
నంఘ్రులకు మ్రొక్కి యిపుడు ధన్యతను గాంతు......

చ. ఇది తగు వేళ గావున నహీనచరిత్రుని బ్రహ్మపండితున్
మది నొకసారి యెంచుట సమంజసకార్యము కాకపోదు స
ర్వదురితనాశకం బతని పావననామము సద్యశోరమా
భ్యుదయ మొసంగఁ జాలునదియున్ గద భక్తి భజించువారికిన్.

ఉ. ధన్యుడనైతి నాంధ్రకవితాగురుపీఠ మలంకరించు మూ
ర్ధన్యులు శిష్యులై పలు విధంబుల జెంతనుజేరి కొల్వ రా
జన్యుని పోల్కి నున్న కవి చంద్రుని గాంచి నమస్కరించి; యే
యన్యుల కింత వాఙ్మయమహత్తరమైన కుటుంబ మబ్బెడిన్!

మ. భవదాశీర్వచనం బమోఘమగుచున్ బ్రాపించె నొక్కింత యీ
కవితావాసన నేఁడు త్వచ్చరణ సాంగత్యంబు సిద్ధించుటన్
భవసాఫల్య మెలర్చె నింక నధికప్రాచుర్యమున్ గాంచి వై
భవ మార్జింపఁగ నీ మహత్తరమనోభావమ్మె తోడయ్యెడున్.

శా. ఈ సంతోషమహావకాశమున నా కే హేతువో గాని శం
సా సంసర్గము లేని చింత యొకఁడుచ్ఛండంబుగాఁ బర్వుచున్
గాసిన్ గూర్చెడి మానసమ్మునకు, సంకల్ప ప్రభావంబొ? లే
దా, సాజమ్మగు భక్తిమూలకమొ? క్షంతవ్యంబు మీ బోంట్లకున్.

మ. స్మరణీయుండగుఁ గాక, స్వీయకవితాసామ్రాజ్యవిస్ఫూర్తికిన్
గురుతాస్ఫీతి వహించి తోడివడుగై కూలంకషంబైన ది
క్తరుణీసేవితసద్యశోరమకు భాగస్వామియౌ వేంకటే
శ్వరు రూపమ్మున నన్న తండ్రికి నమోవాకమ్ము లర్పించెదన్.

ఉ. అంకిలి లేని దేహబల మవ్యయమైన మనోబలమ్ము నా
తంకము లేని శాసనము దాల్చి కవిత్వజగమ్ము నందు న
ల్వంకల నీకుమారుల విలాసములన్ గమనించు చుండఁగా
నింకొక షష్టిపూర్తి ఘటియించుత శాంకరి నీకుఁ బేర్మిమై.

శ్రీకృష్ణ గాన చటుకా భాగవతులు.
అల్లమరాజు పేర్రాజు శర్మ గారు

శ్లో. శ్రీచెళ్ళపిళ్ళకులశేఖర సార్వభౌమ
శ్రీషష్టికీర్తివిభవాయురుదారపుత్ర
శ్రీకృష్ణగానచటుకార్భటికావినోద
శ్రీవేంకటేశ్వరకవీంద్ర నమోనమస్తే.

ఉ. ఏ గురుపాదమూలరజ మెప్డు సుపుత్రధనాది సంపదల్
వేగిర మిచ్చి నా వ్యసన వేదన లెల్లను బాఱఁద్రోలునో
జేగురుపాదు తుల్యదరిఁ జెందిన యా కడియాన వాసమా
నా గురు నాశ్రయింతు మహితాత్మ శుభమ్ము సుఖమ్ము నొందగన్.

గేయము ఆనందభైరవి - ఆదితాళం

ఆనందభైరవి ఆవేశితరూపా అపర్ణాంబా కామేశ్వరీ
నా డెందమునను నిత్యానందపశతను ధ్యానము చేసినిన్? గానమున భజియింతు

గాన నీ యఖిలార్థముల నిడుదానవై నా ప్రాణసఖు నవసానము దనుక
వెనుక మును సంతాన గురు సఖుల దయ నేలుమి॥ ఆనందభైరవి॥

చెళ్లపిళ్లకుల శేఖర వెంకటశాస్త్రి భావుక[illegible]ము జీవనమై యెల్లవేళ కృష్ణ
చిటుకలను నల్లమునను భజియించుచుండెడి అల్లమరాజు వేరిశర్మను
చల్లని కరుణ జూచి ప్రోవుమి॥ ఆనందభైరవి॥

మారువా - ఆది.

శ్రీచెళ్లపిళ్ల వెంకటకవి గురువర శాశ్వతాయుస్సుపుత్రధనబల॥
ఇల్లు, వొళ్లు, బంగారు, శిష్యులకు, బహ్వనోడలైన రీతినొసఁగితి॥
షష్టిపూర్తిసందర్శనమే మా షష్టితాపముల దీర్చినహో॥
ఇష్టదేవతా స్వరూప గురువర ఈప్సితార్థశుభదా సుఖదా॥ శ్రీచె॥

అవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు.

తే. గీ. వీరి శుశ్రూష చేసిన కారణమున
గౌరవమున గద్వాలాత్మకూరు ముఖ్య
రాజసభలందు లాతి పురంబులందుఁ
బడసితి వధానకవితా విభవము వలన.

తే. గీ. శతవధానంబులను వెదఁజల్లినారు
శిష్యులకు సంస్కృతాంధ్రముల్ సెప్పినారు
సులభమౌ తెల్గు కవితను జూపినారు
పావనంబు మా గురువుల జీవనంబు.

జి. బాపుకవిగారు.

ఉ. గంటలు కొట్టి మీ మధుర కావ్యము లాంధ్రుల మేలుకొల్పి యిం
టింటను నాటుకొన్నవి కవీశ్వర! కోతకువచ్చియున్న మీ
పంటను గోసికొమ్మ తిరుపత్యభిధానుడు లేఁడు భాగముల్
గొంటకు నీ విచారమున కుందెద మింతకు వెంకటేశ్వరా.

చ. తెలుగు జగాన నేఁడు గడిదేరిన బాలకవీంద్రు లెల్ల మీ
పలుకుల పందిటన్ జిగురు బట్టిన మొగ్గలు మీ వధానకౌ
శలమున నూగిపోయిన దిశావలయమ్ము ప్రపన్నబుద్ధిమై
వలగొని మీకొసంగెడు నుపాయనముల్ గొనుమయ్య సత్కవీ.

శా. 'రారయ్యా, యవధాన శక్తిఁ గని యారాధింపఁగా' నంచు మీ
రే రాజన్యుని రాజసంబు మెఱయన్ బృచ్ఛింప, రే రాజు మి
మ్మా రేగింపఁడు కొమ్ముటేనుఁగులపై, నుర్వీస్థలింగల్గు స
త్కారంబుల్ మఱియాదలన్నియును మీకై పుట్టి వర్ధిల్లెనో.

శా. నీవున్ దిర్పతియున్ సభాంతరములన్ నేర్పున్ బ్రదర్శించి వి
ద్యావైశద్యము గల్గు పండితకవీంద్రశ్రేణితోడన్ 'సవాల్'
గావింపన్ గని పుల్కరించిన విశాలంబైన యాంధ్రోర్వి మీ
శ్రీవృత్తంబు పఠించి చెప్పుకొనఁజొచ్చెన్ దేశదేశాలతో.

సీ. ఇలు దాఁటి నీవు రావలెఁగాని నీ పదంబులు నమస్కృతులలో మునిఁగి తేలు
చే సాచి నీవు యాచింపఁగావలెఁ గాని మణులతో నీ యిల్లు దొణకిపోవు
తలఁపూని నీ చేఁత గల మందవలెఁగాని సిసలైన కసనంబు చెంగలించు
మన్నించి నీవు సమ్మతిఁ జూపవలెఁగాని బిరుదాళి నీఱొమ్ము తొఱఁగలించు

ఆ. వె. నీకు షష్టిపూర్తిన్ నెఱపి మా బందరు
నిఖిల దిశలఁ బూజనీయయయ్యె
వార్ధకమున గౌరవకిరీటమును బూని
సంచరింపుమయ్యా! సత్కవీంద్ర!.

కృత్తివెంటి వెంకటసుబ్బారావుగారు.

సీ. ఇతఁడెకా! పింగళివరతతీసుమముల బందరువీధి నమ్మ పాత్రతఁ దెచ్చె
ఇతఁడెకా! తెల్గుభారతికిఁగొంగ్రొత్త పోకడల గీరతము మేల్ నుడులఁజాటె
ఇతఁడెకా! మనకెల్ల శతవధానకవిత్వ షడ్రసాన్నంబు బిచ్చంబు వెట్టె
ఇతఁడెకా! రాజరాజతతిన్ సమీపించి యేనుఁగు నెక్కి సన్మానమందె

తే. గీ. కయ్యమున వెనుదీయక కాలుదువ్వి
కవివిజయ భేరిరవము నల్లడలఁ గ్రాల
నితఁడెకా! జంట మ్రోయించె నిద్ధగురుఁడు
వెరసి తిరుపతివెంకటేశ్వరుల నొకఁడు.

శా. కెంగేలన్ గల ఘంటికావలయమున్ గీర్త్యంగనాసేవ వీఁ
కం గాల్పట్టిన గండపెండెరమరీట్కాండంబు టుద్దండతన్
భంగం బొందఁగఁ జల్పెనీ తమదు దీవ్యత్ సజ్జనశ్లాఘ్యమా
మాంగల్యమ్మున కేది లోటు కవితామాద్యన్మహోవిక్రమా.

పోన్నాడ కృష్ణమూర్తి గారు.

ఆ. వె. ఏకలవ్యు లటు లనేకులు శిష్యులు
సవ్యసాచులట్టి [illegible]
నస్త్రగురునిలీల నరుల కజదుర్యుడు
శాస్త్రగురుడవు హితుడవు చలుడు పితడు.

ఉదయగిరి నరసింహమూర్తి గారు, చెళ్లపిళ్ల దుర్గేశ్వరశాస్త్రిగారు.

తే. గీ. పుత్రులను మాడ్కి శిష్యులఁ బూర్ణమైన
కరుణతోడను విద్యలఁ, గరపుచుండు
నిట్టి కవిచంద్రు సేవించునట్టి వట్టి
శుంఠయైనను సుకవియై, శోభ గనడె !

వడ్డాది సీతారామాంజనేయులు గారు.

శా. తాతాజీ ! తమ షష్టిపూర్తిమహ ముద్యత్ప్రీతిగా నీశ్వరీ
మాతృశ్రీకరుణాకటాక్ష గరిమన్ మాకిట్టు లీక్షించు శో
భాతారుణ్యసమృద్ధి శ్రీముఖ మహాబ్దంబందుఁ జేకూరె మీ
ఖ్యాతిజ్యోత్స్న నిజాంతరంగమలమంగా నద్ది దీపించెడిన్.

చెరుకూరి కాళహస్తీశ్వరశర్మ గారు

సీ. ఆంధ్రుల సుప్త చేతోంతరంబుల నూత్న చైతన్యభావ ముద్భూత మయ్యె
ఆంధ్రభాషయె భాషలందు వెన్నయటన్న దివ్యోక్తికిఁ బునః ప్రతిష్ఠయొదవె
ఆంధ్రభూమిపాల కాస్థానముల మాతృభాషాభిమానంబు పాదుకొనియె
ఆంధ్రుల ప్రతి పల్లె నాత్మీయ భాషావిలాసానుభూతి వికాసమెనసె

తే. గీ. చారు భవదీయ కవితా విహారకలన
నభినవాంధ్రోదయమ్మన గాదె కాన
నమనిస్మరియింతు రాంధ్ర సంతతులు నిన్ను
వెంకటకవీంద్ర సారసంవిత్ఫణీంద్ర.

కొండపల్లి గోపాలరావు, హరి రామలింగశాస్త్రిగార్లు.

ఉ. అన్నము పెట్టి శిష్యులకు నాదట విద్యలఁ జెప్పువారిలో
మున్నుగ మిమ్ము నెన్నఁదలఁ బోయెటులన్నను? మీ గృహంబులోఁ
దిన్న దినాలనుండియును నదేపనిగా మతి నేఁటిదన్క నా
కన్నము పుట్టుచున్నది మహాకవిసత్తమ వేంకటేశ్వరా.

పండితారాధ్యుల నాగభూషణముగారు.

సీ. ఎవ్వారిపద్యంబు లెన్నిమార్లు పఠించినను గ్రమ్మఱి పఠింప మనసు పుట్టు
ఎవ్వారి గ్రంథమ్ము లెలమి పఠించినంతనె కవిత్వము( జెప్ప ననువుపడును
ఎవ్వారిపే రాలకించినంతటనె కాకవుల గుండియలు గ్రక్కదలిపోవు
ఎవ్వారి శిష్యుండ నేనంచు దెల్పినమాత్ర లోకమున సమ్మానమొందవచ్చు

తే. గీ. ఎవరిమూర్తులు చంద్రది నేంగ్రిలట్లు(
ప్రకృతకవిలోకగగనమార్గమున వెలు(గు
నట్టి తిరుపతి వేంకటాఖ్యాకకవులు
గౌరవార్హులు గారె యెవ్వారికైన.

సదరు కృష్ణాపత్రికానుబంధమునుండి
శ్రీ కింకవీంద్ర ఘటాపంచానన విద్వత్కవి బాలకలానిధి బాలసరస్వతీ
శతావధాని.
బ్రహ్మశ్రీ చెళ్లపిళ్ల వేంకటశాస్త్రులు గారి

—: షష్టిపూర్తి మహోత్సవము :—

ఆంధ్రమహాజను లనేక దినముల నుండి మహోత్కంఠతో నెదురుచూచు చున్న బ్రహ్మశ్రీ చెళ్లపిళ్ల వెంకటశాస్త్రిగారి షష్టిపూర్తి మహోత్సవము కడచిన శని ఆదివారములయందు నిర్విఘ్నముగ జరిగినది. శాస్త్రులుగారి ప్రఖ్యాతికి తావలమై వారిమూలమున ప్రఖ్యాతిగాంచిన బృన్దావనపురము తనకు ప్రేమాస్పద మగు మూర్తికి జరుగు సన్మానమును గాంచి మురిసినది. ఆంధ్రావని వివిధ ప్రాంతముల నుండి పండితులు కవులు, శిష్యులు, ప్రశిష్యులు, మిత్రులు, అభిమానులు, విచ్చేసి ఉత్సవమునందు పాల్గొనిరి. శనివారమునాటి యుదయమున 8 గం॥ ధర్మపత్నీ సమేతముగ శాస్త్రులవారిని మోటారులో నూరేగించిరి. శ్రీ రామాహైస్కూలు భవనములో సభ జరిగెను ఆహ్వాన సంఘము తరపున రావు బహదూరు శెడింబి హనుమంతరావు పంతులుగారు సన్మానపత్రము చదివిరి. విలువగల సేలువు, ఖద్దరు ధోవతలు, చీర, వెండిపొడుము డబ్బి, వెండిపాందాను, వెండి సిరాబుడ్డి, కలము, చదరంగపు బరిణె, మొదలగునవి శాస్త్రులుగారికి సమర్పింపఁబడెను. వేదవిహితముగ బ్రాహ్మణులు, దంపతుల నాశీర్వదించిరి. శాస్త్రులవారియల్లుఁడగు వెంకటసుబ్రహ్మణ్యదీక్షితులుగారు (11 సం॥ బాలుఁడు)

ఆశీర్వచనపనస యొకటి ఘనజటలతో చెప్పి సభాసదుల కానందము గూర్చెను. కంచి ప్రాంతమునందలి తెన్నాంగూరుగ్రామ నివాసులగు ఘనాపాఠీ, వా॥ సుబ్బరామశాస్త్రిగారు ఆశీర్వదించుచు "శతాయుః" అను పదమునకు శిక్షానిరుక్తాదుల ననుసరించి అర్థము విశదీకరించిరి.

సాయంకాలము నాలుగుగంటలకు శ్రీయుత దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారి యధ్యక్షతక్రింద మహాసభ జరిగినది. పంతులుగారు ఆంధ్రలోకమునకు శాస్త్రులువారివలన గలిగిన మహోపకృతిని వివరించుచు శ్రీకృష్ణదేవరాయలకాలమునకు తరువాత మాఱుమూలల దాగియున్న తెలుగుకవితను ప్రచారమునకు గొనివచ్చి శాస్త్రులుగారు నవీనాంధ్ర సారస్వతమునకు సృష్టికర్తయయ్యెననియు అట్టి మహాపురుషు ననువర్తించుట ఆంధ్రయువకుల కర్తవ్యమనియు నుపన్యసించిరి. ఉత్సవమునకు రాజాలని మిత్రులును శిష్యులును తాను వచ్చుటకు నవకాశము లేనందులకు చింతిల్లుచు జయప్రదముగ నుత్సవపరిసమాప్తి నభిలషించుచు జాబులు వ్రాసిరి. తరువాత పద్యరూపమునను గద్యరూపమునను అనేకులు శాస్త్రులుగారి నభినందించిరి. వేటూరి ప్రభాకరశాస్త్రిగారు తమ యభినందన పద్యములతో వజ్రపు టుంగరమును కాన్కగా బంపుకొనిరి. శ్రీయుత కొల్లిపర వెంకటరమణయ్య నాయుడుగారు, రు. 116 లను, పిసుపాటి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు ఒక సేలువును సమర్పించిరి.

మఱునాటి యుదయమున మహాసభ బ్రహ్మశ్రీ ప్రభల లక్ష్మీనరసింహము పంతులుగారి యధ్యక్షత క్రింద జరిగెను. పంతులుగారు తమ పాండితి కనుగుణముగ గంభీరోపన్యాసమునిచ్చిరి. శ్రీ శాస్త్రిగారి శిష్యులగు ప్రతాపకృష్ణమూర్తిగారు రు. 50 లను గురుదక్షిణగా సమర్పించిరి.

సాయంకాలము శాస్త్రులుగారి యుపన్యాసమగుటచే జనము మిక్కుటముగ వచ్చెను. శాస్త్రులుగారు తమకీయుత్సవము జరపినందులకు కొన్ని పద్యములు జదివి ఉపన్యాసము గావించిరి.

సాయంకాల మాఱుగంటలకు శ్రీ శాస్త్రిగారి గౌరవార్థము బ్రహ్మశ్రీ [illegible] నాగభూషణముగారు గానసభ జరిపిరి. శ్రీయుత అశ్వధాటి రామమూర్తిగారు మృదంగము వాయించిరి. కార్యక్రమము జయప్రదముగ ముగిసినది.

—: గురుదక్షిణ :—

బ్రహ్మశ్రీ చెళ్లపిళ్ల వెంకటశాస్త్రివారు తమ షష్టిపూర్తి మహోత్సవ సందర్భమున నందుకొనిన కానుకలలో వారిశిష్యవర్యులగు బ్రహ్మశ్రీ పింగళి లక్ష్మీకాంతము కాటూరి వెంకటేశ్వరరావుగార్లు తమ కృతియగు 'సౌందరనందా' రూపమున సమర్పించిన గురుదక్షిణ సర్వోత్తమము. యీక్రింది పద్యములు ఆ సందర్భమునఁ జెప్పఁబడినవి.)

క. శ్రీమత్తిరుపతికవిసుత్రామ సుహృత్త్వాభిరామ! రసవత్కవితో
ద్దామా! వేంకటశాస్త్రీ! స్వామీ! గురుదేవ! కొనుము సాష్టాంగనతుల్.

మ. జగదాశ్చర్యకరావధానకవితాసంపత్తికిన్ మ్రొక్కి మీ
యుగళస్నేహముఁ బ్రస్తుతించి భవదీయోదారభావప్రసా
దగుణోత్ఫుల్లకృతిప్రసూనవిగళన్మారందధారానురా
పగ నోలాడి రచించి తెచ్చితిమి దేవా! నీకు నీదక్షిణన్.

మ. వసుధాధీశులు కాన్కలంప సుకవుల్ సద్యోపహారమ్ములం
ప సుధీశాలి శుభాభినందనమొనర్పన్ సంస్కృతాంధ్రాంగనల్
కుసుమోపాయన మీయఁగా నొదవె నీకున్ షష్టిపూర్త్యుత్సవం
బసదే! శిష్యులు కావ్యదక్షిణల నీకర్పించుటల్ దేశికా!

ఉ. కేతనతోడి పొత్తునకుఁ గేల్గలుపన్ దలపోసికాదు నీ
చేతము మెచ్చఁగాఁ గవిత చెప్పఁగ నేర్తుమటంచుఁ గాదు వి
ఖ్యాతికిఁ గా; దిఁకేమనిన, నద్యతనాంధ్రకవిప్రపంచని
ర్మాతకు భక్తిమై నుడుగఱల్ ఘటియించెడి పూన్కయే సుమీ!

చ. గురుతరకావ్యమార్గమునకున్ గృతియిచ్చి గడించినారు బల్
సిరినని యానుమాయితికిఁ జేకుఱె నీచిఱుకబ్బమొండెఁ, ద్వ
చ్చిరసుకృతంబు నేఁడు ఫలసిద్ధి సహింపఁగఁబోలు నొండె నా
దరమున మాయొసంగు గురుదక్షిణ ప్రీతిఁబరిగ్రహింపవే.

ఉ సంచితపుణ్యకర్మము లొసంగు ఫలమ్ములువోలె వాసనల్
ముంచుకొనన్ నవప్రసవముల్ విరఁబూయుచునున్న దీవు క
ల్పించిన పాదులందుఁ బ్రభవించిన నూత్నకవిత్వవల్లి యీ
కొంచెపుఁ బూలమాల కయికొమ్ము గళాభరణమ్ముగా గురూ!

ఉ. భావవిశుద్ధి తోఁపఁగ భవత్పదముల్ భజియించునాఁటి మా
సేవలు మెచ్చి యాదరవిశేష మెలర్పఁగ నిచ్చినట్టి మీ
దీవెన నిక్కమై యొసఁగెఁ దీయని కావ్యఫలమ్ము నేటికిన్
నీ విడినట్టి భిక్ష యిది నీకె యొసంగెద మిష్ట విందుగాన్.

సీ. పుడమి యేఁడులుం దల లడుగులు వోఁసంగ వర్ణించు కావ్యాల సంధువాఁడు
అత్యద్భుతంబైన యవధాన విద్యకుఁ బ్రభవకారణమైన ప్రతిభవాఁడు
వీనుదోయికి తేనెసోనలు వర్షించు వాఙ్మాధురికిఁ బేరువడినవాఁడు
చిననాఁడె వలచివచ్చిన కవితాకన్య నేకపత్నినొనర్చి యేలువాఁడు
తే. గీ. పూర్ణకాముఁడు త్యాగియు భోగియైన
గురుని ఋణ మీఁగుపాంటి నీ చిఱుత కబ్బ
మర్హత గడించుకొనుఁగాక యాంధ్రవాణి
కడకనుల జాల్గొను ప్రసాద కణలవాప్తి.

—:శశికళాస్వయంవరం:—

(బ్ర॥ శ్రీ సర్వా వేంకటశేషయ్యగారు శాస్త్రిగారికి కావ్యకన్యక కిక్రింది గద్యపద్యములతో నప్పగించిరి

సుదర్శనోపాఖ్యానమను నామాంతరము గల శశికళాస్వయంవర మైదాశ్వాసముల పద్యకావ్యము. షష్టిపూర్తి మహోత్సవసమయమున నీకావ్యకన్యకను మద్గురూత్తముల పాదసేవ సేయుటకు భక్తిపూర్వకముగా సమర్పించుకొనుచున్నాఁడను

క. గురు షష్టిపూర్తి మహమున, కరుదెంచిన యగ్రజాత నాయను ప్రాణే
శ్వరుని గని మా "సుదర్శన", సరగున చనుదెంచి పల్కె సంభ్రమమొప్పన్.

చ. జనక! మదగ్రజాత సురసత్త్వము శ్రీపతి వేంకటేశ్వరున్
దన పతిగా వరించి సముదార యశంబు గణించె మున్ను నా
కును దయమీఱ నాథునిగఁ గూర్పవె శ్రీపతి వేంకటేశ్వరా
ఖ్యునిఁ గకవీంద్రమత్తగజకోటిసటాంకుని దేశికేంద్రునిన్.

ఆ పలుకుల కానందముఁ జెందియు నామె చిత్తశుద్ధి నెఱుఁగ దలచి యామె నుద్దేశించి.

క. కల్లయుఁ గపటమెఱుంగక, తల్లీ యుద్వాహ మాడఁ దలచెదె? వయసున్
జెల్లిన యీ బహుపత్నీ, వల్లభునిన్ ఒతకుటుంబ భారార్దితునిన్.

తే. గీ. అనిన నామాట విని యామె కినుక నొంది
పూర్వపక్షమ్ము చేయంగఁ బూని పలికె
నీవెఱుంగని ధర్మము ల్లేవు గాని
తండ్రి! వినవయ్య నా సమాధానములను.

ఆ. వె. షష్టిపూర్తి యయ్యె సత్కవీశ్వరునకు
షష్టిపూర్తి నాకు జరుగనుండె
స్వల్పభేదమంత పరిగణనీయంబు
కాదు గాన వంత గాంచవలదు.

అదియును గాక రాజాధిరాజుల చెట్టపట్టిన వనితల కెన్నఁడును సవతి పోరు తప్పలేదు. కవిరాజు నపేక్షించు నాకు మాత్రమట్టి చేల కలుగకుండును కలుగును గాక.

తే. గీ. అగజ కర్ధాంగ మర్పించి యాదరించి
నట్టి శివుఁ డంతకన్న నాకధిక మేమి
యొసఁగ గలఁడని శంకించు చున్న గంగ
నెలమిఁ దలఁ దాల్పలేదె మహేశ్వరుండు!

నాయం దుత్తమగుణంబులు లేవని నన్నాతండు నిగ్రహించునేమో యని సంశయింపవలదు.

తే. గీ. ఏను శశికల నాతండు నిందుశేఖ
రుండు మాకెట్టి సంబంధ ముండె నదియు
ప్రాజ్ఞులగు లోకులకును సర్వజ్ఞుఁడైన
తత్కవీంద్రునకును విశదంబ కాదె!

ఇదియే నా మనోనిశ్చయము, ఆతని సేవ చేయుటొండె యోగినినై చరించుటొండె, ప్రాణత్యాగంబు చేసికొనుటొండె, యీ మూఁడు పద్ధతులు కన్న నాల్గవది లేను లేదు, అని ఖండితమ్ముగాఁ బలుకు నామెఁ గాదనలేక, ఆమె యభీష్టంబు సమకూర్చుట కే సమ్మతించితి.

ఓ. కవిరాజశేఖరా!

శ్రీమంతు లనేకులు దివ్యసుందరవిగ్రహులైన కన్యకారత్నములను నవ రత్నములతోఁ గూడ నర్పింప నున్నప్పుడు, అలంకార కన్యయు, ఐశ్వర్య

హీనయు, ప్రాకృతవంశసంజాతయు, సకలంకయు, సంస్కారాపేక్షయు నగు నీమెను గ్రహించి మేమేమి లాభము పొందఁగలమని తిరస్కరింపఁ బోకుఁడు. భాగ్యవంతుల తనయుల కన్న నిర్ధనుల పుత్రికలే పతి సేవ చేయుట యందు మిన్నలను విషయమ్ము జగద్విదితము కదా? నీ యీ వయస్సున నిట్టి నిరాడంబర, స్వార్థరహిత, వినయవిధేయతాసమన్విత, వాంఛనీయయని వేఱె నొక్కి వక్కాణింప నవసరము లేదుకదా?

తే. గీ. పోయివచ్చెదనయ్యా నాపుత్రి ముక్కు
పచ్చలారని బాల యప్రాజ్ఞురాలు
యౌను గాదననేర దీ వాదరించి
యెట్లు ప్రోతువో! నీ కప్పగించినాడ.

సర్వా వేంకటశేషయ్య (అని యున్నది)

శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు.

నేను బందరునకు రావలయునని మహాప్రయత్నము చేసితిని, కాని, కొన్ని కారణములచేత రాజాలనందుకు మిక్కిలి చింతించుచున్నాను. ఇది చె॥ వేం॥ శాస్త్రిగారికి చేసిన బహూకృతి గాక, ఆంధ్రలోకమున కంతకును చేసినదిగా విద్వల్లోక మంగీకరించెడు నని నా యభిప్రాయము. భగవంతుడు మనల ననుగ్రహించుగాక.

వడ్డాది సుబ్బారాయుఁడుగారు.

చ. జరుగగ నర్వదేండ్లు వరుసన్ బ్రభవాదులు వచ్చునట్లుగా
బురుషుఁడు షష్టిపూర్తి మహమున్ బొనరించుకొనంగ వానికిన్
మరల కిశోరతాదులగు మంత్రబలంబుననందుప్రి; వేంకటే
శ్వరకవి చెళ్లపిళ్లకులవార్ధికళానిధి వానిఁ గాంచుతన్.

మ. రచియించెన్ బహుకావ్యనాటకముఖగ్రంధంబు లాంధ్రంబునం
దుచితప్రక్రియఁ బెక్కు రాజసభలన్ దొంచెన్ సుసత్కారముల్
మచిలీపట్నపుఁ బాఠశాల జిరకాలం బొజ్జయై తెల్గునన్
రుచిగల్గించెను వెంకటార్యుఁ, డదె, అందున్ గూర్చె నీపండుగున్.

మ. కవియేగాక శతావధాని యయి ప్రఖ్యాతిన్ బ్రకాశించుఁ గిం
కవికుండాలఘుటాసటాంకబిరుదోద్ఘంబాని వర్తించు, హా

స్వవచోధాటి నలర్చు సభ్యుల నుపన్యాసంబులన్, బ్రజ్ఞఁ బు
ట్టువు ధన్యంబొనరించుకోఁగలిగె నిట్టుల్ వెంకటార్యుం డహో!

విశ్వనాథ సత్యనారాయణగారు.

ఉ. లంపులమారి ధూర్తకవులన్ గిసురింతలు సేయు నేర్పు గా
ల్లింపులు మీక దక్కెననిరే! తోలుకారు మెఱుంగు టందపుం
మం పెసలారు గొజ్జగి సుమాళపు మీ కవనంపు నీటులో
జంపుల పల్లెకాపు నెఱజాణల యుయ్యల లూఁపు లూఁగెఁబో.

సీ. సొగసు మీ మేనఁ గస్తూరికావాసనా శ్రీనిక పరిమళించినది తెలుఁగు
మీ ముఖాంభోజాత రామణీయకములో దాఁగుకొన్నది శారదాహాసితము
విద్యానగర రాజవీధులలో బడి కదలి వచ్చినది మీ కడకుఁ గవిత
ఆంధ్రమాతృక మీదు నల్లికలందున మురిసికొన్నది స్వీయ మూర్తి చూచి.

తే. గీ. ప్రకృతి సంపెఁగయైనది భవ ప్రబోధ
చాతురీ వాగ్వనంబున శత్రుమధుప
బాలురకు, శిష్యకోటి భావమ్ము తావి
యయ్యె దాన నంతర్లీనమగుచు బుధులు.

చ. పుడమిని బెక్కుసత్కవులు బుట్టిరి మెట్టిరి సత్కవిత్వపుం
దొడిమలు, చెళ్లపిళ్లకవితోఁ దులఁదూఁగెడువారె! వానలోఁ
దడియనివారు మద్గురు వధానమృదూక్తి మరంద ధారలోఁ
గడుగనివారు మాకెచటఁ గానఁగరారిలఁ దెల్గునాఁడునన్.

నందివాడ వెంకటరత్నముగారు.

(బ్ర॥శ్రీ॥ వెంకటశాస్త్రిలవారి విశాలహృదయమునకును, శిష్యవాత్సల్యమునకును, ఉదాహరణముగా, ఈ క్రిందిపద్యములుచెప్పిన కవిని చేర్కొనవచ్చును. ఇతఁడు వడ్డెవాఁడు, అంధప్రాయుఁడు, వికార రూపి, అనేకు లతని నసహ్యించుకొన్నను వాగ్దేవి ప్రేమతో నితని నోట నివాసమేర్పఱచుకొన్నది. ఈపద్యము లతని నోటనే వినఁబడినవి.)

చ. అమృతము పల్కనేల, నిజమాడెద మద్గురువర్యుఁ బోలు ప్రే
మనిధి మఱొక్కఁ డుండునని మాత్రము నేను వచింపఁజాల; నం
ధునకు గురుత్వమొందుటయె దొడ్డగుణంబుగ నెంచుకొన్న స
జ్జనుని దయామృతంబును విశాలమతుల్ గొనియాడకుందురే.

తే. గీ. "ఏ నసలుకవినయ్య, మీకితఁడు వట్టి
కవియగు" నటంచు నన్నొక్క యువనినేత
కే మహాత్ముండు చూపెనో యా మహాత్ము
నస్మదీయ గురూత్తము నాశ్రయింతు.

సీ. ఇంచుక సాహిత్య మెట్టులో కరుణించె కైతయం దొక కొంత కలిమి నిచ్చె
గానంబుపైనంత కాంక్ష నాకొనఁగూర్చె ఘటవాద్యమునకొంత పటిమనిడియె
నిఁక గృష్ణగాన చిటికెలను వాద్యమ్ములో నింత శక్తిని గానొనర్చె
నవనీశ్వరుల చెల్మి కాధారములు నూపి వారిచే జీవించు భాగ్యమిడియె

తే. గీ. నన్ను మింటనె పెట్టి సద్గన్నతండ్రి
కరణిఁ గాపాడినట్టి నా గురుఁడితండు
సద్గురూత్తముఁ గొల్చిన షడ్డిమృగము
వంటివాఁడైన జ్ఞానియై వన్నెకెక్కు.

హరి నాగభూషణము గారు.

ఉ. ద్వేషములేనివాఁడవు వినోదుఁడవాదువు పెద్దలందు స
ద్భాషలు సేయ నెప్పుడును దాల్మి వహింతువు శత్రులందు ని
ర్భీషణవృత్తి దాల్తువు నిరీహుఁడుఁబోలెఁ జరింతు వేమృషా
వేషము వేయఁబోవు నిను విష్ణుడు ప్రోచుత వెంకటేశ్వరా.

—: సన్మానపత్రము :—

కింకవీంద్ర ఘటాపంచాననా.

మీ షష్టిపూర్తిసందర్భమున భవదీయ కవితావిహారసీమయగు నీ బందరు పురమున మీకు స్వాగతమొసంగు భాగ్యము మా కబ్బినందుల కెంతయు గర్వించుచున్నాము. ఈ యిరువదవ శతాబ్దమున మూలమూలల నున్న కవితావిలాసినిని రంగస్థలమున నాట్యమొనర్పింప సాగించిన మహనీయులు మీరేకదా!

బాలకళానిధీ! అద్వితీయప్రతిభాశాలురౌ తిరుపతిశాస్త్రిగారి నీడు జోడుగా గూర్చుకొని దిగ్దేశరాజన్యసభాంతరాళంబులందు వివిధావధానంబుల నిర్వహించి బిరుదంబు లందఁజాలిన మహనీయుల మిమ్ముల నధికసన్మానంబులందింపఁ జాలువారము కాము.

విద్వత్కవి శేఖరా.

మీ యాంధ్రీకరణంబు లందెల్ల నగ్రగణ్యము దేవీభాగవత మహాకావ్యం బును మీగురూత్తములగు చర్లబ్రహ్మసుధీంద్రుల కర్పించిన మీ ధన్యత మాకె న్నఁదరమే !

బాలసరస్వతీ !

పంచమవేదమగు మహాభారతమును దృశ్యప్రబంధ రూపమునందించి సుబోధముగావించిన మీ భాషాసేవ కాంధ్రలోకమెల్ల మీయెడఁ గృతజ్ఞతఁ జూపఁదగియున్నది.

శతావధాని శిరోమణీ!

ఈ బందరుపురమందలి హైందవోన్నత పాఠశాలలో నాంధ్రదేశిక పీఠము నధిష్ఠించిన పండితులందెల్ల మీ రగ్రగణ్యులనక తీరదు. ఇచ్చో మీరు నాఁటిన కవితా బీజములు మొలకలెత్తి పుష్పించిన తెలుంగును జూడవచ్చిన మీ శిష్యవాత్సల్య మెంతయుఁ బ్రశంసార్హము.

దిగంతవిశ్రాంతయశో విశారదా !

శ్రీ కామేశ్వరీ మహాదేవి మీకు సంపూర్ణాయురారోగ్యైశ్వర్యాహ్లాదంబు లొసంగి వృద్ధి నొందించుగావుతమని యాంధ్రలోక మెల్ల నర్థించుచున్నది.

ఇట్లు ఆహ్వానసంఘము.

మంచాళర్ఘుల సీతారామయ్యగారు.

చ. నొసటం గుంకుమబొట్టు, కేల నొక పొన్నుంగఱ్ఱ, పాదమ్ములన్
వెస పాపోసుల దాల్చి, మే ముతుకుటన్ వెల్లైన గుండంచు మేల్
వసన మ్మంచులు జారఁ గట్టుకొని శ్రీపన్ మేము రాఁ దోఁటకున్
బసరున్ సంజల నేగు మాగురుని రూపం బెప్డు భావించెదన్.

గీ ఎవని ఎఱ్ఱ్యది మాముగ్ధహృదయసీమ
నడఁగి కాన్పించు నంధకారార్చి నార్చె
అట్టి జ్యోతిస్తమోఽతీతమైన యమృత
మస్మదాచార్యవీక్షణ మాత్మ నెంతు.

స్నేహలతా కవితాసంఘము కొల్లాపురం.

సీ. భారతి యెందాక వ్యాపించియున్నదో యందాక మీదు రాజ్యంపుహద్దు
హారిణశాబకచిత్ర వరముద్రితంబగు చంద్రబింబంబె మీజయపతాక

పండితుల్ లక్షణపారీణులును భవదీయరాజ్యంబునఁ దిరుగు ప్రజలు
పాలితోషితముగాఁ బడయుధనంబె మీ పరిజనుండిగొనెడు కప్పంపుసొమ్ము

తే. గీ ధగను దినపతి వేంకటేశ్వరులకెవరు
నీడు రాగన్న సత్కీర్తి నెసఁగునట్లు
శంకరీశ్వరలోకంబుఁ బ్రాకటముగ
నేలుఁ డాచంద్రతారార్క మెనయునట్లు.

శ్రీ రా అప్పయ్యశాస్త్రిగారు.

లలితగీర్వాణాంధ్ర లలనలఁ జేపట్టి బడుగుఁదనమ్ము నోనడపినావు
అవనిత్రయంబు నీ ఠేలుఁగని యనవధానపరిక్రియఁ జాటించి పరిబలినావు
సార్వభౌముని బలె సకలాంధ్ర రాజుల సభల దిగ్విజయంబు సలిపినావు
విస్తృతంబైన కవిత్వ సామ్రాజ్యమ్ము నృపతులమాడ్కిఁ బాలించినావు

తే గీ. వయసు ముదురకతానఁ దత్వాలనంబుఁ
ప్రఖ్యాతములగు శిష్యుల నళ మొనర్చి
సతత మవ్వారి మేల్గోరి జప మొనర్చు
వృద్ధకవిరాజ ! నినుఁగొల్తు వేంకటేశ !

వెంకటశాస్త్రిగారి ప్రత్యభినందనము.

ఉ, బందరుపట్టణంబు నను బంపె బహూకృతిఁ జేసి మున్న, యా
మం దొకసారి నెక్కుడుగఁ బూజితులన్ బొనరించె నిర్భరన్;
విందొనరించె నాకిపుడు వేవురు గల్గు సభాస్థలిన్ మహా
నందము గల్గ నీపురి కనంతసుఖమ్ములరారుఁ గావుతన్.

శా. నా సేమమ్మును గోరి నాకిపు డనన్యాదృత్యమా సత్కృతిన్
శ్రీసంపన్నము గా నొనర్చెడి నినున్ శ్రేయస్సు లెల్లప్పుడున్
భాసిల్లన్ సెగడించు గావుత! సదభ్యాసమ్ముచే నీప్రజల్
వాసిన్ గాంతురు గాత! బందరుపురీ! భాస్వద్యశోవైఖరీ.

చ అలుపదియేండ్లు నిండె నను బట్టుచు యున్నవి పైని మూఁడు న
త్సరములు దాఁటి నాలుగవదానను మాపము లొక్క రెండొగిన్
జరిగెను నాకు నేఁటి, కిది సర్వము సత్యము యూటు నేఁడిటన్
జరగిన సన్మతి ప్రార్థియును సత్కృతి కేఁ దగియుంటి నెంతయున్.

తే. గీ. ఎన్నియో పత్రికల లోన నెందఱెంద
ఱో లిఖించిన యంశమ్ములున్న నెన్నొ
గ్రంథవిస్తరభీతిచేఁ గైకొనంగఁ
జాలక త్యజించుటకు వారు సైఁపవలయు 360

క. కృతి గయికొన్న నరపతికిఁ, గృతికర్తకు మేనుకరుణఁ గృతకృత్యత సం
తత మారోగ్యం బాయువు, సతీసుతుల సుఖము సిరియు సంగతమగుతన్. 361

క. ఎవరో వ్రాసిన రీతిని, స్వవిషయమును జాతకపుస్తకమున్ వ్రాసినాఁడఁ
గవియగుట వేంకటేశ్వరుఁ, డవు నిదియు సశేష ముత్తరార్థంబందున్. 362




శ్రీ. శ్రీ. శ్రీ. శ్రీ. శ్రీ.

# తప్పొప్పుల పట్టిక.

| పేజీ. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 1 | 12 | నే నితనిన్ | యే నితనిన్ |
| 3 | 3 | వార్థకము | వార్ధకము |
| 32 | 26 | జను | జను |
| 34 | 24 | గొందటి | గొందఱి |
| 35 | 5 | వృద్ధి | పృద్ధి |
| ,, | ,, | గఱచుచు | గఱచుచు |
| 72 | 25 | గాపురము | గాఁపురము |
| 77 | 27 | తోనిడ | తోడ |
| ,, | 28 | శునివాస | శునినివాస |
| 79 | 19 | గృతి | కృతి |
| 84 | 26 | కొలుపి | కొలిపి |
| 92 | 25 | శత్రువుఁ | శత్రువుల్ |
| 102 | 3 | ఔనో | జైనో |
| 116 | 2 | కక | కొక |
| ,, | 24 | వనిపు | వచుపు |
| 121 | 7 | తీకులఁగు | తీకులగు |
| 127 | 19 | బాపులును | బాపులను |
| 160 | 5 | పిందు | పించె |

జా. చ.